## ముఖ్యాంశము

ఈ గ్రంథకర్తచే వ్రాయబడిన డాక్టరు రమేశం అను పుస్తకము
వెలువడినది. అతి నవ్వుగా యుండును. ఇంక తెప్పించుకొరా?
అది చదువునప్పుడు నవ్వనివారికి బహుమతి
యివ్వబడును.

ముద్రణ:
శ్రీ సత్యవతీ ప్రెస్,
రాజమండ్రి.

# లాయరుగిరీశం

## మొదటిభాగం

### మద్రాసు ప్రయాణము.

మా స్వగ్రామం గంజాంజిల్లాలో శ్రీకాకుళం సమీపంగాయున్న పెద్దపాడు అనే చిన్న పల్లెటూరు. నాపేరు గిరీశం. మా తండ్రిపేరు దూర్వాస సోమయాజులుగారు. ఆయన అతి ఛాందసుడు; పూర్వాచారపరాయణుడు. అందుచే నాకు వేదం చెప్పించడమేగాని ఇంగ్లీషువిద్య చెప్పించేవాడు కాడు. నాకు మాత్రం ఇంగ్లీషునేర్చుకుని పెద్దవుద్యోగం చెయ్యాలనివుండేది. అందుచేత పట్నంవెళ్ళి చదువుకుంటానని రోజూ పేచీపెట్టేవాడిని. అయినా మా నాన్న చాల పట్టుదల మనిషవుటచేత నామాట మాఅమ్మమాట సాగిందికాదు. ఇంతలో మాపురోహితులు మునసబుగారిపిల్లవాడికి చదువుచెప్పడానికి ఒక ఇంగ్లీషుమేష్టరిని మాగ్రామం తెప్పించారు. మానాన్న చూడకుండా రోజూ ఆయనవద్ద ఇంగ్లీషునేర్చుకుంటోవుండేవాడిని. అలా నాలుగేళ్ళు పాటు ఇంగ్లీషు నేర్చుకున్నాను. ఇంగ్లీషు చదవడం వ్రాయడం బాగా వచ్చినది. మా మేష్టరు రోజూ మా అమ్మదగ్గరికి వచ్చి మీవాడికిచదువు బాగావస్తూంది. త్వరలో చెన్నపట్నం పంపి లాయరుగా చేయించేస్తాను. మీవాడు ప్లీడరయ్యాక నన్ను

మరిచిపోతా రేమో' అంటూండేవాడు. మాఅమ్మ చాలా అమాయకురాలు. అందుచేత కొడుకు గొప్పవాడవుతాడని సంతోషముచేత మానాన్న చూడకుండా మాగురువుగారింటికి ధాన్యం, పప్పులు, ఉప్పులు పంపిస్తూవుండేది. ఇలా కొంతకాలం జరిగాక మాగురువుగారు మాగ్రామంవిడిచి వెళ్ళిపోయినారు. నాకుమాత్రం లాయరుకావలన్న ఆశపోలేదు. అందుకు చెన్నపట్టణము వెళ్ళాలనివుండేది. మానాన్నతో చెప్పితే పంపించడం సరికదా తొక్కచీరేస్తాడు. అందుకు ఏమిచేయుదునా అని రాత్రింపగళ్ళు మాఅమ్మతో ఆలోచిస్తూయుండేవాడిని. మా అమ్మకికూడా మానాన్నఅంటే హడలే. అందుచేత యెందుకు నాయనా మానాన్నతో అల్లరిఅని నన్ను మందలిస్తూవుండేది. యేమయినా నాకు చెన్నపట్నం వెళ్ళితేమంచిబట్టలుండాలికదా అని అదివరకే అప్పుడూ అప్పుడూ నాలుగు పెద్దగావంచాలు ఒకదుప్పటిరేకు, ఒకజెంబుకాన, మాఅమ్మకుట్టినవి మూడు చొక్కాలు, పైమీదికి రెండు గావంచాఅంచు కండువాలు, నాలుగు తడుపుగావంచాలు జాగ్రత్తపరిచే వుంచేను. ఇంక సొమ్ము చెయ్యిచిక్కగానే యెవ్వరికీచెప్పకుండా వుడాయించాలని సిద్ధంగా వున్నాను. మానాన్న మహాలోభి. నాకు మా అమ్మకి యెక్కడా కానీఅయినా చేయిచిక్కనిచ్చేవాడుకాడు. అయినా ఒకనాడు మహామంచిఛాన్సు దొరికింది. అది యేమిటంటే- ఒకరైతు దస్తుతెచ్చి మానాన్న లేనందున నాకు యిచ్చి వెళ్ళేడు. ఆ వంద రూపాయలతో ప్రయాణము

సాగింపవచ్చు అనుకున్నాను. మరునాడు తిథివారనక్షత్రాదులు బాగుండుటచేత ఆవేళ ప్రయాణమునకు నిశ్చయించాను. వెంటనే మాఅమ్మ చూడకుండా మూటాముల్లె కట్టివేసేను.

తెల్లవారుజామున లేచి శ్రీకాకుళముమీదుగా ఆము దాలవలస వెళ్ళి రైలుయెక్కుటకు నిశ్చయించాను. రాత్రి పడుకున్నానేగాని ప్రయాణపాలోచనచేత నిదురపట్టినదికాదు. ఇంతలో తొలికోడి కూసింది. మా వీధిపంచపాళీలో నా బస గనుక మావాళ్లు చూస్తారన్న భయములేదు. వెంటనే లేచి దంతధావనముచేసుకొని మూట చంకనెట్టుకొని బయలుదేరాను. నాకు మానాన్నలాగునే శకునాల ఛాదస్తమెక్కువ. దానికి తగినట్టే అడుగవతలపెట్టేసరికి తోక ఆడించుకొనుచు మా నల్లపిల్లి తయారయినది. దానిని మాసందు దాటినదాక వెంటదరిమి యింటికివచ్చి రెండునిమిషాలు కూర్చుండి మళ్లీ బయలుదేరేను. ఇంతలో మా నాయనమ్మముండ చెంబుపట్టుకొని ఎదురుగావస్తూంది. దానినోరెండుతిట్టి అదిచూస్తుందేమో అని భయంచేత మా పంచలో దాకొని రెండు అపశకునాలు ఒక మంచిశకునముతో సమానమనితలంచి మళ్ళీ బయలుదేరేను. దైవకృపచేత మళ్ళీ అపశకునాలేమీ కనబడలేదు. మూట నెత్తిమీదపెట్టి తిన్నగా నడవడం ప్రారంభించాను— తెలతెలవారుచున్నసరికి పట్టణము చేరుకున్నాను. తిన్నగా యేటిఒడ్డునకు వెళ్ళి మరచిపోయి మళ్లీ పళ్ళుతోముకున్నాను. తరువాత ఇంటివద్దదంతధావనముచేసినమాట జ్ఞాపకంవచ్చింది.

తద్యోగ్యా, మరచిపోయానుకదా అనుకున్నాను. అయినా 'అధికస్య అధికం ఫలం' అనుకున్నాను. సూర్యోదయమయేసరికి స్నానం సంధ్యాకూడా పూర్తిఅయినవి. తరువాత పూరిలోనికి బయలుదేరేనుగాని తెల్లవారేసరికి యింత చల్దిఅన్నం తినేవాడిని ఆపూట లేనందున మహా ఆకలిగావుంది. అయినా ఆ వీధులలో తిరిగేజనం, వింతవింతలయిన బళ్ళూ, ఆ మేడలూ, ఆ వీధులోచూస్తే నాకుగలిగిన ఆనందంచేత తిండిమాట మరచిపోయాను. అయినా ఆకలి జ్ఞాపకంచేస్తూవుండడంచేత యెవరయిన యింత అన్నంపెడతారేమో అడుగుదాంఅంటే యెవరు బ్రాహ్మణులో, యెవరుకారో తెలియదు. యేందారి అనుకుంటూ తిరుగుతున్నాను. యింతలో ఒకచోట 'ఇచ్చట భోజనము పెట్టబడును' అని వ్రాసివుంది. అదిచదివి బ్రతికానురా బాబు అనుకొని ఆ యింట్లోకి వెళ్ళేను. గాని యెవరిని అడుగనా అని ఆలోచించి అక్కడ ఒక ఆడమనిషి కనబడితే ఆమెయే యింటి యజమానురాలయి వుంటుందనుకొని 'యేమమ్మా కొంచెము చల్దిఅన్నం పెట్టిస్తారా' అని దండంపెట్టి అతివినయంగా అడిగాను. యింతలో ఆమె నేను అంట్లుతోముదాసీని; లోపలయింట్లోకి వెళ్లి అడగండి పెడతారు అని అంది. దాసీదానికి దండం పెట్టేను. యెంత ఫూల్ నయినాను అని నాలోనేను చింతించి లోపలికివెళ్లి అక్కడ యింకొక స్త్రీ కనపడేసరికి యిదివరకులాగ టోపీపడకుండా దర్జాగా మాటలాడుదా మనుకొని 'ఏమే! ఇక్కడ చల్దిఅన్నం పెడతారా

అన్నాను.' అందు కామె మండిపడి 'నేను నీ పెళ్ళాన్ని అను కున్నావా? మాటలు తిన్నగారానీ లేకపోతే తాపులు తిన గలవు' అని అనరాని మాటలంది. ఇంతలో ఒక బ్రాహ్మణుడు వచ్చి 'ఆమె యెవరనుకున్నావయ్యా! ఆమె యీ యింటి యజమానురాలు. యిక్కడ చల్దిఅన్నం దొరకదు. కావా లంటే వేడిఅన్నం పెడతాం అన్నాడు. సరే పోనీ అదే పెట్టండి అన్నాను. ఇలా యీ గదిలో కూర్చోండి, అని ఒకపీట విస్తరీ వేసారు. నేను నా చిన్నగావంచాతడిపి చుట్టబెట్టుకొని యింత విభూది యిమ్మన్నాను. విభూదిలేదని యింత కుంకంయిచ్చి 'మీాల్సు ఫస్టుక్లాసుకావాలా సెకండుక్లాసుకావాలా'అన్నాడు ఇంగ్లీషు రాదనుకుంటాడేమో అని అడావిడిగా ఫస్టుక్లాసు అన్నాను. కొంత సేపటికి భోజనం అయింది. తిడితే తిట్టారు గాని తిండి బాగానే పెట్టేరు. అని సంతోషిస్తు వీధిగుమ్మంవరకు వచ్చాను. అక్కడెవరో నన్ను పిలిచి ఒకకాగితము చేతి కిచ్చారు. అందులో ఒక ఫస్టుక్లాసుభోజనము 8 అణాలు అని యున్నది. 'ఎందుకీ కాగిత' మని నేను అడిగినాను. మీారు భోజనము చేసినందుకు బిల్లు. అది పుచ్చుకొని అర్ధరూపాయి యియ్యండి అన్నాడు.

'ఏమి వూరయ్యా యిది! బ్రాహ్మణుడుకి భోజనంపెట్టి డబ్బులడుతారా? ఈపాటి గొప్పకేనా ఇంతపెద్ద బోర్డు కట్టి నారు' అని వారితో గట్టిగా దెబ్బలాడి వారిడబ్బువాళ్లకిచ్చి చక్కావచ్చాను. ఇకనుంచి ముందు ఖచ్చితముగా అడగందే

మొగమాటముపడి ఏపని చేయకూడదనుకున్నాను. ఏమైనా ఒకబండీ చూచుకొని ఆముదాలవలస వెళ్ళాలనితలంచి ఒకబండీ వానిని పిలచి ఎంతకి కట్టుతావని అడిగేను. వాడారణాలు యిమ్మన్నాను. బేరంలో తొందర పడకూడదు. తక్కువ నుంచే అడగాలని నేనొక డబ్బు యిస్తానన్నాను. ఆ తొత్తు కొడుకు కట్టలేదు సరేకదా కొరడాతో కొట్టబోయాడు. పైవూరువాళ్ళతో జట్టీ ఎందుకని నేను శాంతపడి మాట నెత్తిమీద పెట్టుకొని నడుస్తున్నాను. కొంతదూరం వెళ్ళేసరికి ఎవడో నను రెక్కపట్టుకొని నిలువబెట్టి 'ఏం ఫూల్ చెముడా? వినపడదా? హారన్ కొట్టినా కదలవేమి? కారుక్రిందపడి చావాలని వుందా?' అని నాలుగుతిట్టి ప్రక్కకు తోసివేసాడు. డాం డాం అని వినపడినదిగాని ఏదో అనుకొని వూరుకున్నాను. ఇంతకీ ఇవాళ మనరోజు మంచిదికాదని మళ్లీ బయలుదేరి కొంచెము నడచివెళ్ళి అక్కడొక లాంతరు స్తంభము చాటున అల్పాచమానముకి కూర్చున్నాను. యింతలో పోలీసాతను వచ్చి ఏయ్ మనిషివికావా లెమ్మని కేకలేశాడు. వుండయ్యా బాబు ఆపుకుందామన్నా ఆగకుండా వున్నదని బ్రతిమాలి పూర్తిగావించి లేచేను. తరువాత వాడు నారెక్కపట్టుకొని ఏమయ్యా సిగ్గులేదా? యిలా వుచ్చపోస్తావా? మీదేయూరు అని అడిగేడు. సిగ్గెందుకయ్యా నేనేమి తప్పుచేయలేదు. ఇదిగో పైకితీసి జందెము చెవికి చుట్టేయున్నది అన్నాను. చప్ ఫూల్ ఆ గొడవ ఎవరికికావాలి స్టేషనుకు నడువన్నాడు. పదండి నేను

అక్కడకే వస్తూన్నాను అన్నాను. వాడు ఎందుకేమిటన్నాడు. రైలు ఎక్కడానికన్నాను. రైలుస్టేషను కాదయ్యా పోలీసు స్టేషన్ అన్నాడు. నేనేమి దొంగననుకున్నావా రానుపొమ్మని చేయి విదలించుకోపోయాను. ఆ చచ్చుసీనుగు వూరుకోక చేయి విడువకుండా లాటీతో రెండు పొడిచాడు. ఇంక శాంత పడడము మంచిదనుకొని వాడివెంట కుక్కలాగున వెళ్ళేను. స్టేషనుకు వెళ్ళేక మీా దేయూరు, నీపేరేమిటి నీతండ్రిపేరేమిటి అడిగేరు. యీా వెథవలతో చెప్పితే మాా నాన్నకు వుత్తరం వ్రాస్తారురా అనుకొని నేచెప్పను పొమ్మన్నాను. చెప్పుతావా లేదా అన్నారు. మళ్ళీ చెప్పననేసరికి లాటి చూపించారు. మళ్ళీ తాపులు తినాలిరా భగవంతుడా అనుకొని అయ్యా! దయ వుంచి నన్ను విడిచిపెట్టండి. నేను లాయరవడానికి చెన్నపట్టణము వెళ్లుతున్నాను. లాయిరయివచ్చాక మీాకు మంచిబహుమ తిస్తాను అన్నాను. వారది ఏదో యిప్పుడేయిస్తే వదలుతా మన్నారు. యిందాక మార్చిన రూపాయిలో మిగిలిన అర్థ రూపాయి వారికిచ్చి విడిచిపెట్టమని దండంపెట్టి బ్రతిమాలాను. వారిలో ఎవడో ఒక ధర్మాత్ముడు లేచి పాపం వీడెవడో ఫూల్ లాగునయున్నాడు, విడిచి పొమ్మనండిరా అన్నాడు. వారందు లకు అంగీకరించి నన్ను పొమ్మన్నారు. బ్రతుకు జీవుడా అను కొని బయలుదేరేను.

ఇంతలో చీకటిపడు సమయమయినది. ఏదైనా తిరుగు బండి అయితే చౌకగా దొరుకుతుందని ప్రతి బండివానిని మీా

చేయనూరు అని భోగట్టాచేస్తూ బయలుదేరేను. నా అదృష్టము వల్ల ఒక తిరుగుబండి దొరికింది కాని అది పోతొలుబండి. అయినా జేర మాట్లుదామని నన్ను తీసుకువెళ్లుతావా ఒక అణా యిస్తానని అడిగి దూరంగా నిలువబడ్డాను. వాడు సరే నన్నాడు. కొడతాడేమో అని భయపడ్డాను. గాని 'సాహసే లక్ష్మి' అనుకొని బండిఎక్కేను. ఆ బండికి గూడులేకపోవుట వల్ల మంచు బాగాపడుతోంది. దుప్పటితీస్తే మాసిపోతుం దనుకొని ఆ బండిలోనిగడ్డి కప్పుకున్నాను. కొంత దూరము వెళ్ళేసరికి ఏదో చిటికినవ్రేలుమీద చిటుక్కున కుట్టింది ఏమిటా అని చూస్తే పెద్దతేలు కనబడింది. చచ్చేనురా బాబు అనుకొని బండివానితో చెప్పేను. యింతలో బాధ ఎక్కువయింది. తెల్ల వార్లు బండి నడుస్తూనేయున్నది. నేను ఏడుస్తూనే యున్నాను. ఆముదాలవలస వెళ్లేదారిలో రైలుగేటు కట్టియున్నది. అక్కడికి మాబండి జేరేసరికి తెల్లవారుజాము అయింది. దైవకృప చేత తేలుకాటు బాధతగ్గింది. రైలు వస్తూండడముచేత గేటు వేసివుంది గనుక మాబండి ఆపేము. ఇంతలో రైలువచ్చేసరికి ఆచప్పుడికి పోతులు బెదిరి బండి నడ్డంగా యీడ్చుటచేత బండి గొడుగుపాటు అయింది. బండిలోవున్న నాకు మా బండివానికి కూడా మోపుగా దెబ్బలుతగిలాయి. ఇదంతా దుశ్శకునఫలంరా బాబు అనుకొని మళ్ళీ మెల్లిగా ఆ బండిమీదనే బయలుదేరి స్టేషన్‌దగ్గర దిగేను. అక్కడొకచోట ప్రయివేటు వైద్యశాల అని వ్రాసివుంటే యిది రహస్యమయిన ఆసుపత్రిగనుక యెవ

రికీ తెలియదని అక్కడకు వెళ్లి డాక్టరుతో యీ సంగతంతా చెప్పి దయయుంచి ఏదైనా మందు యిప్పించాలన్నాను. సరే యీ దెబ్బలకు కట్లుకట్టాలి. మూడురోజులు యిక్కడ వుండా లన్నాడు. నాకుఅప్పుడు ఒళ్లు భారగించి జ్వరమువచ్చినట్లు వుంది. అందుచేత అలాగే అన్నాను. వెంటనే నా దెబ్బలకు కట్లుకట్టి ఒక మంచము పరుపు యిచ్చి, అందుమీాద పడుకో మన్నారు. అయ్యా! భోజన మెలాగన్నాను. భోజనము కూడదు. పాలు రొట్టె మేమే యిస్తామన్నారు. పోనీ డబ్బు లేకుండా ఏదిదొరుకుతే దానితోనే సంతోషించుదా మను కొన్నాను. అక్కడ నౌకర్లుమాత్రము గడిగడికీ కానీ అర్ధణా యిమ్మని పీకుకొని తింటూండేవారు. డాక్టరు ఏమి అడుగుతూ వుండ లేదు. గనుక వీళ్ళకేనా యివ్వకపోతే బాగుండదని వారు పదిసార్లు అడుగుతే నేను ఒకమాటొకడబ్బు యిస్తూవుండే వాణ్ని. కాని యింతలో ఆ పనివాళ్ళు మాలవాళ్లని తెలిసింది. అయ్యయ్యో శ్రోత్రియమైన కొంపలోబుట్టి సమస్త శాస్త్రములు చదివిన దూర్వాస సోమయాజులుగారి పుత్రుడనిపించుకొని యిన్నాళ్లకి యీ మాలకూడు తినడమా? ఛీ, ఛీ, ఎంతపాపం? ఇంటికి వెళ్లి ప్రాయశ్చిత్తము చేయించుకోవాలి, అనుకొని యిక యిక్కడ వుండకూడదని నిశ్చయించి ఆ కట్లువిప్పి అక్కడ పారవేసి దిగ్గునలేచి డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి 'ఏమయ్యా! మాలామీాలా భేదము చూచుకోవద్దా? గుప్పెడు జంధ్యాలతో వున్న బ్రాహ్మణ ముండావాణ్ని మాలవాళ్లకి వప్పగిస్తావా?

చాలుచాలు నీకొకదండం నీ మందులకొక దండం, యిదిగో నే పోతున్నాను' అని చెప్పేశాను. అందుకా డాక్టరు మండిపడి యింత ఆచారముంటే యింట్లో కూర్చుండలేకపోయావా? నీ కర్మం పోతేపో; నా బిల్లుడబ్బు నాకిచ్చిమరీ వెళ్ళు అన్నాడు. ఎందుకేమిటిబిల్లు ఎంతఏమిటని అడిగేను. అదిగో మా రైటరు బిల్లు యిస్తాడు; పుచ్చుకోమన్నాడు. అందుమీద యిలా వ్రాసివుంది.

| | |
|---|---|
| మంచం రోజు 1 కి | 0—1—0 |
| పరుపుకి | 0—0—6 |
| దుప్పటికి | 0—0—6 |
| గదికి | 0—2—0 |
| బ్యాండేజి సామగ్రులు | 0—8—0 |
| మందుచార్జి | 0—6—0 |
| డైటు, రొట్టె, పాలు | 0—6—0 |
| సర్వెంట్సు | 0—4—0 |
| మొత్తం | 1—12—0 |

ఈ బిల్లు చూచేసరికి నాగుండె గుభేలుమంది. మాల కూడు పెట్టడముకాకుండా డబ్బుయివ్వమంటారా? నేను ప్రాయశ్చిత్తము చేయించుకోవాలి. దానికిఖర్చు ఎవడిస్తాడు? ఒక్కదమ్మిడీ యివ్వదలచుకోలేదు. నీదిక్కున్నచోట చెప్పుకోఅని కనులెఱ్ఱజేసి వానిని బెదిరించా. ఆ డాక్టరు మండిపడి నౌకరును పిలచి డబ్బు ఎలా యివ్వడో వీడిని ఆ గదిలో పడేసి

మాటలాగుకొండిరా అన్నాడు. చెప్పడమేతడవుగా ఆ మాల పీనుగులు వచ్చేస్తున్నారు. ఈ మాలపీనుగులు మీాదపడి మాట లాగుకొంటారని మా తండ్రికికూడ తెలిస్తే చిక్కొస్తుందని, లాయరవడానికి లేటు అయిపోతుందని ఆలోచించి కొంచెం శాంతపడి ఆ బిల్లుడబ్బు వాళ్ళెదానకొట్టేను. డబ్బుమాట కేం గాని మాలవాళ్లు తెచ్చిన రొట్టెపాలు తిన్నాను, ఏందారా అని కించమాత్రం పోలేదు. లాయిరయి వచ్చాక ఏదైనా కేసుపెట్టి యీా డాక్టరుగాడి డొక్క చీరేయాలని నిశ్చయించి గబగబ స్టేషనుకు పరుగెత్తేను. అక్కడొక గదిదగ్గర జనులంతా మూగు తుంటే వాళ్ళకన్నాముందు నేనే టికెట్టు కొనాలని తలంచి లోపలికి వెళ్ళేటకు అక్కడ మూగియున్న జనుల కాళ్ళసందు లలోనుంచి దూరేను. వాళ్ళలో ఒక మొద్దుపీనుగు నన్ను చూసేడో లేదో గాని కాలు జడాయించాడు. ఆ కాలునున్న మేకులజోడు తగిలి పెణత బ్రద్దలయింది. ఎలాగైతేనేమి లోపల చేరాను. అక్కడవున్న నలుగురు కాస్త రాక్షసబొగ్గువేసి కట్టు కట్టేరు. అయినది ఏదోఅయింది చెన్నపట్నంపోవాలి టికట్టు యియ్యండి అన్నాను. ఇక్కడ టికెట్లు అమ్మరు. ఇది గూడ్సు స్టేషను అన్నారు. ఏ స్టేషను అయితేనేమి డబ్బుపుచ్చుకొని టికెట్లుయిస్తే నీకొంప ఏమిములుగుతుంది? వీళ్ళంతా నీ బాబు గారిచుట్టాలా? నేకానా? ఈ నీ వేషాలు లాయరు గిరీశంగారి దగ్గర పనికిరావని తెలుసుకో. మళ్లీమాట్లాడితే నిన్ను డాక్టరు గాడి లెక్కలోనే వేస్తాను అన్నాను. యింతలో ఆ గుమాస్తా

మండిపడి పోర్టరు అని కేకవేసి ఏదో చెప్పేడు. ఆ వెంటనే ఓ యిద్దరు వెధవలువచ్చి నన్ను అమాంతంగా బయటికి మోశ్శారు. యిప్పుడు వీళ్ళతో తొందరపడడము మంచిదికాదనుకొని కొంచెము శాంతపడి వాళ్ళనే మంచిమాటలాడి టిక్కెట్లు ఎక్కడిమ్ముతారో కనుక్కొని ఆ స్థలానికి వెళ్ళేను. నేను స్వయంగా వెళ్ళి టిక్కెట్టుకొంటే ఏంచిక్కువస్తుందో అని ఎవరిచేతనయినా కొనిపించుదామని ఒకకుర్రాడిని బ్రతిమాలి చెన్నపట్నం టిక్కెట్టు కొనిపెట్టమని వానికో 12రూపాయలు యిచ్చాను. నేను తెలివైనముండావాడినిగనుక వాడిపెట్టె నా దగ్గరవుంచుకునే వాడిని పంపించాను. పాపం వాడైనా మంచివాడే. నిముషములో టిక్కెట్టు తెచ్చి నేను పారవేసుకోకుండా వాడే నా కండువాకొంగున కట్టిపెట్టేడు! నేనుచాలా సంతోషించి వాడిని ఏమైనా కొనుక్కోమని డబ్బుమార్చి దమ్మిడీ చేతికిచ్చాను. ఇంతలో గంటవాగింది. ప్రజలంతా రైలువస్తుందనుకుంటున్నారు. నేను వాళ్ళవెనకాల వెళ్ళబోయాను. ఆ గేటులోవాడు ఏయి! టిక్కెట్టు అని కేకవేశాడు. వుందయ్యా యిదిగో అని మూట చూపించాను. వాడు టిక్కెట్టుపైకితీసి చూపించాలన్నాడు.

ఇంతనమ్మవేమిటి? గాయత్రితోడు అని ప్రమాణముచేసి చెప్పేను. అయినా ఆ ముండావాడు విన్నాడుకాడు. ఇంకతప్పదని ఆటిక్కెట్టువిప్పి చూపించాను. వాత్తేరా అని వాడన్నాడు. వానితో నిజము చెప్పటమెందుకని అవుసని నాటిక్కెట్టు

పుచ్చుకొని మళ్లీ మూటకట్టుకొని లోపలికి వెళ్ళేను. ఇంతలో పెద్దచప్పుడు చేసుకుంటూ రైలుబండి వస్తూంది. అదిచూచి ఆహా! కంపెనీవాడి మహిమ అని ఆనందించి ఆశ్చర్యంగా నిలువబడి చూస్తున్నాను. ఇంతలో బండివచ్చి ఆగేసరికి జను లంతా మూకలుమూకలుగా వెళ్ళి రైలుపెట్టెలలో ఎక్కుతు న్నారు. నేనడావిడిపడితే యిందాకటిలాగ ఏదైనా ప్రమాదం వస్తుందేమో అని నిదానంగా బయలుదేరి కాళీగావున్న బండి ఎక్కాలని తిరిగితిరిగి ఒకపెట్టెలోజేరాను. ఈ సమయములో ఎవడో రైలునౌకరువచ్చి యీపెట్టె సిక్ చేశారు. దిగండి అన్నాడు. నేనూ సిక్కుగానేయున్నాను. దిగనన్నాను. చప్ దిగుతావా లేదా అని వాడు కేకలేశాడు. నేనుదిగను నీ దిక్కున్నచోట చెప్పుకో, నాకేమి టిక్కెట్టు లేదనుకున్నావా? గిరీశంగారి తడాకా తెలిదేమో జాగ్రత్త అన్నాను! దానితో వాడు పరుగెత్తుకొని వెళ్ళి ఒకదొరను లాక్కొచ్చాడు. అయినా గిరీశంగారికి యింగ్లీషువచ్చునుకదా? పరవాలేదనుకున్నాను. వాడు నాదగ్గరకువచ్చి పెట్టితలుపు తెరచి నన్నుజూచి ఏంయ్ కమ్డౌన్ అన్నాడు. నే నదివిని నో గోయింగ్ ఆఫ్ అని బల్లపై ఎక్కి కూర్చున్నాను. వాడు కోపగించుకొని నాచెయ్యి పట్టు కొని గొరగొర బయటికీడ్చి పొమ్మన్నాడు. నీపని యిప్పుడు కాదు. మద్రాసు వెళ్ళిరానీ చెప్తాను. అని తొందరపడడము మంచిది కాదనుకొని కొంచెము శాంతపడి మరియొక పెట్టెక్కు దామని బయలుదేరేను. ఇంతలో రైలుపూదింది. అడావిడిగా

పరుగెత్తి నేనొకపెట్టెలో దూరేసరికి రైలు నడిచింది. గాని అందులో అంతా స్త్రీలే వున్నారు. అయితేమాత్రం నిశ్చల చిత్తులైన గిరీశంగారి కేమిభయం అనుకున్నాను. ఇంతలో ఓ ముండలేచి ఏమయ్యా యీ పెట్టెలోఎక్కేవు నీకేం సిగ్గుబొగ్గు లేదా అని అడిగింది. నాకేమి టిక్కెట్టు లేదనుకున్నావా అని నూటు చూపించాను. టిక్కెట్టు వున్నా సరే యీ బండిలోకి మొగవారు రాకూడదంది. కంపెనీవారిబండికి నీ పెత్తనమేమిటి? మీరంతా చాలమంది యున్నామని ఆలోచిస్తున్నావేమో యీ గిరీశంగారు అలాజడిసే రకంకాదు. అని వారిని లక్ష్యము చేయకుండా చెప్పేశాను. ఇంతలో మరోస్టేషనువచ్చేసరికి బండి ఆగింది. మళ్లీ మునుపటివారే వచ్చి ఫూల్ యిందులో ఎక్క వేమిటిరా అని నాశలవు లేకుండా నన్ను చేయిపట్టుకొని గొర గొర బైటికీడ్చేశాడు. అదిచూచి ఆపెట్టెలో ఆడవాళ్ళంతా పకపక నవ్వేరు. వెధవల్లారా నవ్వుకోండి, మీపళ్లే కనబడ్డాయి అనేశి వూరుకున్నాను. కడుపులో చాలా ఆకలివేస్తూంది. ఏవో చాలా సామానులు అమ్ముతున్నారు. కాని డబ్బుదండుగ ఎందుకని వూరుకున్నాను. కాని అంతా ఒకచోట మంచినీళ్లు త్రాగుతూవుంటే నేనూ ఆగొట్టం దగ్గరకు వెళ్ళి కడుపునిండా నీళ్ళు త్రాగేశాను. తిరిగివచ్చి మళ్లీ రైలుఎక్కేసరికి బండి బయలుదేరింది. యీ పెట్టెలోనివా కైవరుమాత్రం పొమ్మని దెబ్బలాడలేదు. నేను బండిలో ఒకబెంచిమీద కూర్చుని బండి పోవుచున్నప్పుడు కనబడే దృశ్యములు చూచుచు ఆనందిస్తూ

యున్నాను. ఇంతలో ఒకడు పుస్తకాలు కావాలా అంటూ బయలుదేరేడు. మనదగ్గా తెలియాలని యేమైనా 'లా' బుక్సు వున్నాయా అని అడిగేను. చుట్టూవున్న జనులంతా నను చూచి దంగు అయిపోయారు. ఇలా కొంతసేపయేసరికి చాలా స్టేషన్లు దాటేయి. యింతలో నాకు కడుపునొచ్చింది. పైకి వెళ్లాలిబాబూ యేందారి అనుకున్నాను. అంతకంతకు తొందర ఎక్కువయింది. ఏం చేయుటకు ఆలోచన పాలిపోక ఇటు అటు చూస్తూన్నాను. ఇంతలో పైన ఒకచోట "గొలుసులాగిన రైలు ఆగును." అని వ్రాసివుంది.

అదిచూచి అతి ఆనందించి పాపం కంపెనీవాడు అన్ని సదుపాయాలు చేసే వుంచాడనుకొని ఆ గొలుసులాగేను. ఇంతలో చాలాజనం నా బండిదగ్గర ఏదోగొడవగానేవున్నారు. నేను పైకివెళ్లుట పూర్తిఅయాక కాళ్లూచేతులు కడుక్కొని వస్తూవుంటే అడుగో వీడేఅంటూ ఓయిద్దరునన్ను పట్టుకున్నారు. వారిలో యిందాకిటి దొరకూడ యుండి ఏమిరా, ఎందుకుబండి ఆపేవు అన్నాడు. జాగ్రత్త మరియాదగా మాటలురానీ. నాకు సాలుకైదువందలువస్తాయి. త్వరలోలాయరుకూడ అవుతాను. జాగ్రత్త డొక్కచీరేస్తాను. "అనవసరంగా బండిఆపేవుగనుక ఏభైరూపాయలు ఫైన్‌యిచ్చుకోవా" లన్నాడు. అనవసరముగా బండి ఆపేనా? కచ్చేలో విరోచన మవవలసింది. పోనీ కదాఅని దిగివెళ్ళేను. అందుకు సంతోషించు అన్నాను. వాళ్లేరులో వీడిపని చెప్పుదామని నన్ను బండిలో తోసేసి

బండీ వదిలేశారు. కొంతసేపయేసరికి వాల్తేరుస్టేషనులో బండి కదిలేసమయానికి మరియొకపెట్టెలో కూర్చున్నాను. మెయిలు సామర్లకోట వచ్చేవరకు నన్నెవరు పలుకరించలేదు. అక్కడ మాత్రం ఎవడో ఒక నల్లదొరవచ్చి అందరిని టిక్కెట్లు తనిఖీ చేస్తున్నాడు. నామూట ముడి గట్టిగానే వున్నదికదా అని ధైర్యంగానే యున్నాను. వాడు నాటిక్కెట్టుకూడా అడిగేడు. ఓయస్‌గా తనిఖీచేసుకో చూపిస్తానని మూటవిప్పి చేతికిచ్చాను. వాల్తేరువరకే యీ టిక్కెట్టు వుంది. ఎక్సెస్‌చార్జి యిచ్చె అన్నాడు. నాకు మహాకోపం వచ్చి ఏడిసినట్టేవుంది నీ తెలివి. మెడ్రాసు టిక్కెట్టుఅది. కావాలంటే టిక్కెట్టుకొనిపెట్టిన కుర్రాడిని కూడా సాక్ష్యమడుగు. తిన్నగాచూచి మాటాడు. నీ తికమకలు లాయరు గారి దగ్గర పనికిరావు అని ఘోర్సుగా చెప్పేశాను. ఏడిశావు ఫూల్ మాటాడకు క్రిందకుదిగు అని నన్ను చెయ్యిపట్టుకొని గొరగొర క్రిందకీడ్చి యింకెవ్వరికో అప్పజెప్పాడు. నేను తొందరపడడం ఎందుకని నా టిక్కట్టు మళ్ళీ చూచుకుంటే వాల్తేరువరకేవుంది. మూటగట్టిగా కట్టేనుకదా టిక్కెట్టు ఎలా మారిపోయిందా అనుకొని వీళ్ళతో దెబ్బలాడితే లాభంలేదని కొంచెము శాంతపడి ఆ రైలువాడికో అర్ధరూపాయిఇచ్చి బ్రతిమాలుకొని మెల్లిగా వాడిచేతిలోనుంచి తప్పించుకొని బయటపడ్డాను. సాయంత్రానికిరాజమండ్రి చేరుకొని గోదావరిస్నానం చేసి మెడ్రాసుకు మరునాడు మెయిల్‌ఎక్కుదామని నిశ్చయించి

టికెట్టు యింక నా స్వంత చేతులతో నే కొనాలనుకొని ఆ గది దగ్గరకు వెళ్ళి రాజమండ్రికో టికెట్టు పుచ్చుకొని మళ్ళీబండి ఎక్కి బయలుదేరేను.

బండిలో అక్కడక్కడ దొంగలున్నారు జాగ్రత్త అని వ్రాసివుంది. అందుచేత మనం జాగ్రత్తగా వుండడం మంచిదను కొని నెత్తిమీదమూట దింపకుండానేకూర్చుని నాచుట్టుప్రక్కల యెవరు కూర్చోబోయిన నల్లకాదంటూ వుండేవాణ్ని. వాళ్లు దెబ్బలాడి కూర్చుంటూవుండేవారు. వెధవరైలు ఎక్కడమే నాది తప్పు. మద్రాసుకి బండిమీదేనా పోయానుకాను. అను కున్నాను. ఇంతలో యెవరో నన్నుపిలచి అయ్యా! ఎక్కడ దిగు తారు అన్నారు. నేను రాజమండ్రిలో దిగుతానన్నాను. వా రూరుకోక గోదావరిలోదిగుతారేమో అని అడిగాంఅన్నారు. నేమండిపడి వెధవల్లారా గోదావరిలో దిగటానికి నా ఖర్మం ఏం కాలింది మీరేదిగండి అన్నాను. కోపం ఎందుకండీ మేము యెలాగాదిగుతాం అన్నారు. ఆ దిగండి లోతుగా చూచుకొని దిగండి మునిగిపొండి, చావండి, నాకేం అన్నాను. నదిలో కాదయ్యా స్టేషన్ సంగతి చెప్పేము. వెర్రివాడా గోదావరి అని స్టేషను ఉంది. నీను తెలియదేమో అన్నారు.

ఇంతలో మెయిల్ రాజమండ్రి వచ్చింది. నేను మెయిల్ దిగి బయలుదేరేను. యీమూటు బండిగోడవ లేకుండా నడిచే వూరిలోకి వచ్చాను. పట్నాలలో డబ్బియ్యందే భోజనం పెట్టరు. ఈపూటఅయినా తినకపోతే

నిలవలేనని తలంచి తిరిగి తిరిగి చెల్లయ్యమ్మహోటలుకు చేరు కున్నాను. స్నానసంధ్యా పూర్తిచేసుకొని యేమమ్మాయింత అన్నంపెట్టించాలి అన్నాను. ఆమె సరేఅని భోజనం పెట్టింది. ఆమెనుచూచి 'ఆహా! అమ్మా! అదృష్టవంతురాలవు; నీకు సూర్యచంద్రులులాగా యిద్దరుకొడుకులు. అన్నపూర్ణా దేవి లాగా యెవరొచ్చినా యింతఅన్నం పడేస్తున్నావు. అని పొగు డుతూ మాటలసందడిలో మరింత నెయ్యి వేయించుకుంటూ తింటూన్నాను. ఆమెకూడా నా వలలోపడి మహాప్రేమగా మాటాడుతూ నాయనా నీవంటేనాకు చాలానమ్మకంగా వుంది గనుక నీవొకచిన్న సలహా చెప్పాలిఅంది. నేనింకా లాయరవ కుండానే అంతా నా వద్దకి సలహాలకి వస్తున్నారుకదా అని ఆనందించి అయ్యో! అలాగేను చెప్పవమ్మా అన్నాను. అప్పు డామె కుమారులనుచూచి నాయనా వీరిలో పెద్దవాడు తురకకి పుట్టేడు. చిన్నవాడు బ్రాహ్మడికి పుట్టేడు. ముందు పెద్దవానికి ఒడుగుచేయనా, చిన్నవానికి ఉపనయనము చేయనా చెప్పాలి అంది. నేనది విని మండిపడి అయ్యో ముండా! నా కొంపదీశావ్రులే నీగోలకాల. నాకెందుకే అని లేచిపోయి దీనింట్లో ఎందుకు తిన్నానురా దేవుడా! నాలిక కోయించుకున్నా ఈ పాపంపోదు, యేమిచేయుదును? ఇంటివద్ద హాయిగా తిని కూర్చోక యీ దిక్కుమాలిన లాయరుచదువుకి యెందుకు బయలు దేరానురా దేవుడా! మావూరు ఆ దిక్కు మాలిన మేష్టరు రాకపోయినా బాగుండును. ఇప్పుడేందారి

అయ్యో! యేమనుకుంటే యేంలాభం? కోటిలో బుఱ్ఱపెట్టి రోకటిపోటుకు వెరవడం యెందుకు? కష్టే ఫలీ అన్నాడు. అని శాంతపడి అక్కడనుండి వచ్చేశాను. ఈ అల్లరిలో ఆ మెడబ్బు అడగలేదు.

పోనీ యిదీ లాభమే అనుకున్నాను. ఆ రాత్రికి యెవరి పీధరుగుమీాదనో గడిపీసి మరునాడు గోదావరిలో మునిగి నాయంత్రం స్టేషనుకు వెళ్ళి స్వయంగా టిక్కెట్టు కొనుక్కొని మెయిలెక్కి బయలుదేరేను. నా అదృష్టమువల్ల మెయిలులో చోటుబాగాదొరుకుటచేత ఆ రాత్రిహాయిగా నిదురపోయాను. మరునాడొకస్టేషనువద్ద యెవడో వచ్చి అందరివద్దా టిక్కెట్లు లాగుకొంటూన్నాడు. నన్నూ టిక్కెట్టు యిచ్చిమన్నాడు. అయితే నాది మెడ్రాసుటిక్కెట్టు-నే నిక్కడియ్యను అన్నాను, యే టిక్కెట్టైనాసరే యిచ్చియ్యాలి అన్నాడు. నాకు మహా కోపంవచ్చి యీా డాబుసరి నావద్ద పనికిరాదు. సామర్లకోటలో నాది తప్పుటిక్కెట్టు అవుటచేత బ్రతిమాలేనుగాని ఇప్పుడూరు కోను జాగ్రత్త అన్నాను. వాడు ఏయ్ ఫూల్ యిస్తావా లేదా? అని టిక్కెట్టు బలవంతాన లాగుకున్నాడు. యీా వెధవలంద రికి యింతకన్నా మరి యింగ్లీషు రాదుకావలెను అనుకొని నేను వానితో కుస్తీకి తయారయాను. తక్కినజనమంతా నన్ను మందలించి ఆయ్యా పరవాలేదు; టిక్కెట్టు యిచ్చివే యండి. మెడ్రాసులో మనని మరెవరు టిక్కెట్టుఅడగరు. అందుకే మేమంతా యిచ్చేశాము అన్నారు. 'నేనంత తెలి

చూనివాడినికాను. యీ వెధవకంత పొగరేమని తిరగబడ్డాను' అని కమ్ముకొని; ఆ టిక్కెట్టు వాడియెదాన్ని కొట్టి వ్రూం-కున్నాను. కొంతసేపయేసరికి మెయిల్ మెడ్రాసు చేరుకుంది. ఆహా! ఆ సెంట్రల్ స్టేషను చూస్తే మహావింతగా వుంది. నేనింత ట్రావిల్ చేశాను. యిలాటిస్టేషను యెప్పుడూ చూడలేదు. అక్కడ సంగతులన్నీ చూస్తే నాకు మహా కంగారుగా వుంది. యెలాబయటికి - వెళ్ళాలో కూడా బోధపడ లేదు. అయినా తెలివైన ముండావాణ్ణిగనుక యెవరిని అడగకుండా జనం వెనుక బయలుదేరేను.

---

# లాయరు గిరీశం

## రెండవ భాగం

నేను పెద్దపాడనే మా గ్రామంనుండి బయలుదేరి పడ రాని వాట్లు అన్నీపడి లాయరవాలన్న ఆశతో మెడ్రాస్ చేరు కున్నాను. రైలుదిగి బయటికి వచ్చేనేకాని సాధారణపు పట్నా ల్లోనే తబ్బిబ్బ్బవడే ముండావాడ్ని గనుక మెడ్రాసుచూస్తే నాకంతా అగమ్యగోచరంగా యుంది. అయినా కొంచెము బుద్ధికుశలతగల ముండావాడ్ని గనుక నా కంగారు బయటకు తెలియజేయకుండా యెక్కడ బసచేయనా యని యోచిస్తూ యున్నాను. జనంఅంతా గుఱ్ఱపుబళ్ళమీద, జట్కాలమీద, మోటార్లమీద సాధారణపు బండ్లమీద, తోపుడుబండ్లమీద యెక్కి వెళ్ళిపోతూ వున్నారు. నాకు బండి కట్టించుకోవడము యిష్టములేక డబ్బు దండుగయెందుకని సత్రవు యెక్కడో యెవరినైనా కనుక్కొని అక్కడికి పోదామని నిశ్చయించి చూస్తూవుంటే అక్కడి జనులంతా యేదో వేరేభాషతో మాట్లాడుతూ యున్నారు. అదియేమిటో తెలుకోవాలని అక్కడ మనదేశమతనే ఎవరో నిలబడితే వారినిపిలిచి "అయ్యా! మీరు మాట్లాడే భాషయేమిట"న్నాను. అతడది అరవ మన్నాడు. నాకు మహా కోపమువచ్చి ఏమిటయ్యా యీ హాశ్యాలు! నీకేమి మేనత్తకొడుకునా మేనమామకొడుకునా? అరవం, కేకవేయడం అని ఎక్కడైనా భాషలుంటాయా? నువ్వు

చెప్పనే అక్కరలేదు. అని అక్కడనుండి పోయాను. అక్కడ మరొకతనిని కలుసుకొని అయ్యా యీవూరులో మంచి సత్ర మెక్కడుందో చెప్పతారా అని అడిగేను. మొకము చిట్లించుకొని నేరుగపోయి విచారించన్నాడు— నాకొల్లుమండి నాకర్మం ఏమికాలింది విచారించటానికి నువ్వే విచారించు. గోలునయేసు, నెత్తి మొత్తుకో అని యీ వెధవలందరిని అడిగేదేమిటి బండి కట్టించుకొనే పోదామనుకొని పట్నంలో వెధవలంతా లంచగొండి వెధవలు; ఒట్టినేమాటకి జవాబైనా చెప్పరు అని అనుకొని ఒక బండివాడిని కేకేసి ఒరే! అబ్బి మంచిహోటేలికి తీసుకువెళ్లరా అనిచెప్పి బండికట్టమన్నాను. రాఅప్పా! రొంబమంచి హోటలుకి తీసుకెళ్ళుతాను అని వాడన్నాడు. "వెధవ! నీకునాకు వరసేమిటి నేనేమి ఆడదాననను కున్నావా! అప్పా అనడానికి? వెకసెక్కేలుమాని తిన్నగా మూడాడు అని బండిఎక్కేను. ఆముండావాడు నన్ను మూడు గంటలవరకు త్రిప్పిత్రిప్పి ఒక హోటేలువద్ద దింపెడు. నీవద్ద చిల్లరవుందా? అద్దెయెంత అని నేనడిగేను. అంజి రూపాయి కుడు అప్పా! అని వాడు అయిదేళ్లు చూపించాడు. ఓరి ముండాకొడకా! అయిదురూపాయిలు అద్దేమిటి! ఈవూరులో నావద్దడబ్బంతా బళ్లవాళ్ళే తినీసీలావున్నారు. బండి ఎందుకెక్కేనురా దేవుడా అని లబో లబో మన్నాను.

ఆ తొత్తుకొడుకు నన్ను నిలవనీయకుండా తొందర చేసేడు. యీబళ్ల వెధవలతో పేచీపడితే తంతారుకూడాను

అని నాలుగు రూపాయలు చేతిలోపెట్టి వానిని బ్రతిమాలి పంపించాను.

ఆ హోటలు మేడ చాలా అందంగా వుంది. ఈ మేడ యింత గొప్పగావుంది. ఇది హోటేలు అవునా కాదా ? యెక్కడా భోజనం పెట్టబడును అని వ్రాసిలేదు. ఏమి అని చూచాను. ఇంతలో ఒకచోట నిత్యానందభవన్ అని వ్రాసి వుంది. ఇది ఏదో భవనము; ఏరాజుదైనా అయియుంటే భోజనం పెడతారా అంటే తంతారేమో ఏందారి ఎవరిని అడగను అనుకుంటూ మనము మొదటనుంచి ధైర్యమయిన మనుష్యులము గనుక సాహసించి లోపలికి వెళ్లేను. ఆ యింట్లో పైన ఏదో విష్ణుచక్రాలులాగ గిరగిరతిరుగుతున్నాయి. అవి ఏమిటోగాని వాటిక్రింద మహా మంచిగాలికూడా వేస్తోంది. అదియేమిటో నాకు బోధపడలేదు. గాని యిలాటి స్వల్ప సంగతు లెవరినయినా అడుగుతే మన హోదాకి తక్కువగా వుంటుందని వూరకున్నాను. అక్కడే మేనేజర్సు ఆఫీసు అని వ్రాసివుంటే అక్కడికి వెళ్ళి అయ్యా నాకిక్కడ బస, భోజనము దొరుకుతుందా నేనీవూరులో లాయరవడానికి వచ్చాను. అని ఇంగ్లీషున అడిగేను. ఆ ముండావా డెందుకోగాని నన్ను మహావింతగా చూచి నవ్వుకొని 'ఓ! దొరుకుతుంది. దయ చేయండి' అని ఆ గోడనున్న గుండి ఏదో నొక్కేడు. ఇంతలో ఒకనౌకరు వచ్చి 'అయ్యా! దయచేయండి అని నానెత్తిమీద మూట లాగుకోబోయాడు. మూటమాత్రం ముట్టుకోకు. అని వాని వెనకాతల బయలుదేరేను.

ఆ వెధవ నన్ను త్రిప్పిత్రిప్పి మూడంతస్తులు దాటించి నాలుగో అంతస్తులో ఒక గది చూపించాడు. ఆ మేడ మెట్లు యెక్కేసరికి నాకాళ్లు పడిపోయాయి. ఒరే! భోజనాలు ఎక్కడ అంటే 'అయ్యా! క్రిందహాలులోనే' అన్నాడు. చచ్చానురాబాబు అనుకొని 'క్రిందఏమీా బసలు దొరకవా' అన్నాను. లేవు; కావాలంటే యిక్కడికే భోజనం తెస్తారు అని వాడు చెప్పేడు. స్నానం యెక్కడ చేయడం అనేసరికి నాకు బసయిచ్చిన గదిలోనే మరియొక చిన్నగది చూపి అయ్యా! యిదిగో యిక్కడ స్నానంచేయవచ్చు. అదిగో ఆ గొలుసులాగుతే నీళ్ళువస్తాయి అని చెప్పేడు. సరేపొమ్మని వాడితో చెప్పి తలుపు గట్టిగా వేసుకొని ఆ చిన్నగది గుమ్మం దగ్గరే నామూట వుంచి ఆ నీళ్ళగదిలోకి వెళ్ళి గొట్టముక్రింద నిలబడి గొలుసులాగేను. యింతలో నీళ్ళు దబదబ పడ్డాయి. అయ్యో! చచ్చానురా వెధవా! చర్మం వూడిపోయింది. వేడినీళ్లురా దేముడా అని మొర్రోమని ఒక కేకవేసి బయటి కొక్క గంతువేసి దభేలుమని గది తలుపులు వేసి నామూట పట్టుకొని బయలుదేరేను. క్రిందికి వచ్చేసరికి యిందాకటి మేనేజరు నన్నుచూచి 'అయ్యా! స్నానం అయిందా' అన్నాడు.

'ఆ! స్నానంకాదు. చావు అయింది. ఇంతభోజనం పెట్టు చాలు మరేమివద్దు' అని వాడు చూపించిన గదిలోకి వెళ్ళి తడిగావంచాతో కూర్చొని తింటున్నాను. వంటవాడిని

పిలిచి అయ్యా! కూర తెండన్నాను. ఇందాకా వచ్చినపుడు నిదురపోతున్నావా? అని కోపగించేడు. "రసం కావాలా, సాంబారు కావాలా" అన్నాడు. ఏమిరసం చెప్మా! కొంపతీసి పాదరసం కాదుగదా? అనుకొని చూచి చెబుతాను తీసుకురా అన్నాను. నాకు యిదేపని అనుకున్నావా? అని వాడుపోయాడు. విస్తరులో వున్న వాటితోనే తిని ఆకలిగావున్నా అలిగి లేచిపోయాను. ఒక వెధవైనా వచ్చి యేమి లేచిపోయావు అనికూడా అడగలేదు. నాకు కోపంవస్తే మాయింటివద్ద మానాయనమ్మ, మాఅమ్మ మానాన్న యెంతమంది బ్రతిమాలినా తినీవాడిని కాను. ఈ వెధవలు బ్రతిమాలందే మళ్లీ తింటానా? అనుకొని మేనేజరుగదికి వెళ్ళేను. వాడు నన్ను చూచి ఏమయ్యా! మేజ మీాద అలా నీళ్లువదిలేసి పూసుకోనడమేనా? 20 గేలన్లునీరు పోయింది దానికిమీాకు రు. 5 లు ఎక్కువిచ్చుకోవాలన్నారు.

"ఏడిసినట్టే వుంది వెధవహొటేలు. నీళ్ళకి, నిప్పుకి కూడా డబ్బు యిచ్చుకోవాలా? ఇంక నీయింట్లో వుంటే పెద్ద వొట్టు యిదిగో పోతున్నాను" అని చెప్పేసరికి ఆ హొటేలు పీనుగు యిదిగో యీాబిల్లు యిచ్చి మరీవెళ్లు అని ఒకకాగితము చేతికిచ్చాడు. ఈ కాగితం దండుగకూడా యెందుకు? ఆ ఏడిసీది ఏదో నోటితో ఏడువరాదా అని ఆ కాగితం చూచాను. అందులో యిలా వ్రాసివుంది.

| | |
|---|---|
| అదనము నీళ్ళకు చార్జీ | 5—0—0 |
| 1 పూట భోజనం, బస | 1—8—0 |
| మొత్తం | 6—8—0 |

అనివుంది. ఈ బిల్లుచూచి ఏమిటయ్యా యిది పూట భోజనానికి 6 అణాలుయిస్తె అతిఎక్కువ. నీ బసలో నేనుండనే లేదు. వెధవ వేడినీళ్లతో ఒళ్ళు కాల్చుకున్నాను. యీ సౌఖ్యానికేనా ఆపున్నర బిల్లు ఎవరైనావింటే నవ్విపోగలరు. నాది పల్లెటూరని టోపీవెయ్యాలని చూస్తున్నావేమో నీ శతభిషలీ గిరీశంగారిదగ్గర పనికిరావు. గానంచా కట్టుకున్నానని తక్కువగా చూస్తున్నావేమో మూటలో కండువా లేకపో లేదు. జాగ్రత్తగా ఆలోచించి చెప్పు అన్నాను. వాడు మండి పడి ఆ డబ్బియ్యందే వల్లకాదు. ఆ నీ గొడవ మాకెందుకు ఇబ్బియ్యందే కదలనీయము అన్నాడు. నాకు మహాకోపం వచ్చిందికాని యీ వెధవలతో పేచీయెందుకని కొంచెము శాంతపడి ఆ బిల్లుడబ్బు వాళ్లకి పారేసి తక్షణము మూట పట్టుకొని పోయాను.

బయటికి వచ్చేసరికి అక్కడ ఏదోబండి నిలబడింది. అది అచ్చంగా రైలుబండిలాగ వుంది, కాని యింజను మాత్రములేదు. అది ట్రాము బండియని అందుమీద ఎక్కడికి వెళ్లినా చౌకగా వెళ్ళవచ్చునని తెలుసుకొని వూరంతా ఒక్కమారు చూచి రావచ్చునని అందుపైన బయలుదేరాను. ఇంతలో బండినడిచింది. దీనికి యింజను లేదుకదా ఎలా నడు స్తుందా అన్న ఆలోచన మాత్రమునాకొదలలేదు. యింతలో ఎవడో వచ్చి 'ఎన్నాసార్ ఎంగాపోరామ్' అని అన్నాడు. యేమిటాగోల తెలుగునయేడు అన్నాను. పిదప వాడు ఎక్క

డికి పోతారు అన్నాడు. నాగోడవ నీకెందుకు నేచెప్పను పొమ్మన్నాను. కాదు, మే మీా ట్రాము తాలూకు మనుష్యులము ఎక్కడికి కావాలో టిక్కెట్టు పుచ్చుకోండి అన్నాడు. అలాగా! యీా బండి ఎందాక పోతుందన్నాను. వెంకటేశ్వర పిళ్లెగారి సత్రమువరకు పోతుందని వాడు చెప్పేడు. సరేఅని ఒకటిక్కెట్టు పుచ్చుకున్నాను. కొంతసేపటికి ట్రాంబండి వచ్చి ఆ సత్రమునకు ఎదురుగా నిలచింది. నేనక్కడ దిగి ఆ సత్రపు గుమస్తాను కలుసుకొని అయ్యా నేనిక్కడ లాయరవడానికి వచ్చాను. బసచూచుకునే వరకు దయయుంచి నా కొక గది యిప్పించవలసింది అని నే నడిగేను.

సరే మీారు బి. యల్. చదవడానికి వచ్చారాఅని వాడన్నాడు. కాదయ్యా ఎన్ని సార్లు చెప్పాలి లాయరవడానికివచ్చానని చెప్ప లేదా? యింత తెలియనివాడు సత్రంగుమస్తా యేలా చేస్తున్నాడో అని నవ్వుకొని అయ్యా! వేగం తాళము యిప్పించండి. తరువాత తాపీగా మాటాడు కొనవచ్చునని తాళం పుచ్చుకొని ఒకగదిలో బసచేసి ఆ పూటకు భోజనము కూడా సత్రంలోనే ఏర్పాటు చేసుకున్నాను. ఆ రాత్రికి అక్కడభోజనముచేసి పడుకొని మరుచటి ఉదయము లేచి తలుపు తాళము వేసుకొని ముందు వూరులోని సంగతులన్నియు బాగుగా తెలుసుకొనవలయునని తలంచి మూట చంకను బెట్టుకొని షికారుగా బయలుదేరేను. తెల్లవారేసరికి చల్దిఅన్నంతినే ముండావాడ్ని యిల్లు విడిచినదగ్గరనుండి చల్దిఅన్నం వహాతే

మర్చిపోయాను. నా బ్రతుకు యిలా కష్టాలుపాలు అయిపో యింది కదా అనుకుంటూ తిరుగుతూ వుండేసరికి అక్కడొక చోట కాఫీ, భోజనశాల అని వ్రాసివుంది. అదిచూచి కాఫీ భోజనం అంటే చల్దిఅన్నంఅనుకొని లోపలికి వెళ్లేను. లోపల జనం రద్దీ జోరుగానేవుంది. ఆ లోపల అంతా యెక్కడ చూచినా అంతా యేవో ఫలహారములు చేస్తూయున్నారు. కాని నాకెక్కడా చల్దిఅన్నం తినేవాడు కనబడలేదు. ఇంక వీరినిఅడిగి లేదనిపించుకోవడ మెందుకని తిరిగి చక్కావచ్చాను. ఇంతలో చాలా ప్రొద్దుయెక్కుటచేత బసకు పోవాలని నిశ్చ యించి బయలుదేరేను. అవేవో యెన్ని వీధులు తిరిగినా నే బస చేసిన సత్రవు కనబడలేదు. ఇంతలో అక్కడొకచోట పోష్టు అండ్ టెలిగ్రాపు ఆఫీసు అని వ్రాసివుంటే మావూళ్లో ఒక్క పోష్టాఫీసు అనేవుందికదా ఇక్కడ టెలిగ్రాపు అనికూడా వ్రాసేడు. అదిఏమిటో కనుక్కోవాలని బుద్ధిపుట్టి ఎలాఅయితే నేమి కొంతసేపటికి టెలిగ్రామ్ అంటే వుత్తరంకన్నా అతి వేగంగా వెళ్లేదనన్ని, దానికి 12 అణాలు పుచ్చుకుంటారనిన్ని మెల్లిగా జోగట్టాతీసి యింక దాపరికము యెందుకు? నే నిక్క డకు వచ్చినట్టు మా నాన్నకి టెలిగ్రాం యిచ్చేద్దామని ఆలో చించి యీసారి కుర్రపీనుగులను నమ్మకూడదని తలంచి అక్కడో పెద్దమనిషిని పిలిచి అయ్యా నాకొక్క టెలిగ్రాఫ్ తెప్పించమని వానికో 12 అణాలు చేతికిచ్చాను. వాడెందుకో నవ్వుకొని సరే అని ఒక కాగితము తెచ్చియిచ్చాడు. అందు

పైన టెలిగ్రాఫ్‌ఫారము అని వ్రాసివుంది. అది చూచి యీసారి వీడు దగాచేయలేదని సంతోషించి సిరాలేనందున నాజేబులోనున్న యింకుపెనసలుతీసి వుమ్మితో తడిపి వ్రాశాను.

"నాన్నగార్కి కుమార్డు నమస్కారములు. మీతోను అమ్మతోను చెప్పకుండా వచ్చినందుకు క్షమించవలసింది. నేను యిక్కడ లాయస్రై తిరిగి వచ్చేస్తూన్నాను. చల్దిఅన్నం లేక సకలచిక్కగావుంది. అమ్మని బెంగపెట్టుకోవద్దని చెప్పవలెను. మన బోడావుకు పురుడు వచ్చింది లేనిది వ్రాయించవలెను. యిది టెలిగ్రాపు గనుక ఆట్టేచోటులేక ఎక్కువ సంగతులు వ్రాయలేదు. ఇక్కడ నేను క్షేమం. అక్కడ మీ క్షేమం వ్రాయించవలెను." అని వ్రాసి సంతకముచేసి మడచి పైన మహారాజశ్రీ మా నాన్నగారికి, స్వగ్రామం. అని వ్రాసి ఆ పోష్టుపెట్టెలో పడేసి చక్కావచ్చాను. ఇంతలో రెండుజాముల వేళఅయింది. కడుపులో ఆకలిచేత దహించుకుపోతోంది. మా సత్రవు కనబడలేదు. ఎక్కడనైనా చౌకగా భోజనం దొరుకుతుందేమో అని బోగట్టా చేయాలని నిశ్చయించాను. అక్కడొకచోట శుచిగా భోజనం పెట్టబడును. పూటకు పావలా అని వ్రాసివుంది. భోజనం చౌకగావుందని తలంచి సంతోషంగా లోపలికివెళ్ళి ఆ దక్షిణాది బ్రాహ్మణుల హోటేలులో ఆ పూటకి తిండితిని ముందీవూరి బోగట్టా పూర్తిగా తెలుసుకోందే చదువుసంగతెత్తుకో కూడదని నిశ్చయించి, హోటల్ వాళ్ళకి డబ్బులిచ్చేసి మళ్ళీ బయలుదేరి తిరగడం ప్రారంభిం

చాను. తిరిగితిరిగి సాయంత్రం అయేసరికి బీచికిచేరుకున్నాను. అక్కడ ఆకాశముమీాద ఏదో గ్రద్దలాగ తిరుగుతోంది. ఏమిటాఅది అని నేను వింతగా చూస్తూన్నాను. యింతలో అది మెల్లిగా క్రిందికి దిగుతోంది. అన్నా! యిది పెద్దగ్రద్ద. మనుష్యులనే తన్నుకుపోతుందిరా బాబు అనుకొని చూస్తూ వున్నాను. యింతలో అది నాపైనే వ్రాలుతున్నట్టు కనబడింది. అదిచూచి బెంగపడి చచ్చానురా భగవంతుడా! అనుకొని ఏమిచేయుదును యని తలంచి కంగారుపడి కాంగ్రెసుమని పడ్చి అక్కడున్న దిబ్బదొరసానిని కౌగలించుకున్నాను. ఆ ముండ నన్ను కసిరికొట్టి క్రిందపడేసి మీాదకూర్చొని ఎవరినో కేకవేసింది. వెధవముండా, నువ్వే చస్తావు లే. గ్రద్దతన్నుకుపోతుంది; నే నడుగున హాయిగా వుంటాను. కూర్చో ముండా, కూర్చో అని వూరుకున్నాను.

ఇంతలో ఎవడో దొరవచ్చి దాన్ని లేవదీసి నన్ను పిలకట్టుకొని కొరడాతో రెండుకొట్టి పొమ్మన్నాడు. నేలేచి చూసేసరికి యిదివరకు ఆకాశమున నే చూచినగ్రద్ద క్రింద దిగివుంది. అయ్యో! యిది గ్రద్దకాదు. ఏదో యంత్రమువలె వుందిఅని తలంచి పూర్తిభోగట్టా తీయవలెనని ప్రయత్నించి దానిని ఎయిరోప్లేను (గాలివిమానము) అంటారనియు అది ఆకాశమున తిరుగ గలదనియు దానిపైన మద్రాసుఅంతయు తిరుగుటకు 10 రూపాయలు పుచ్చుకుంటారనియు తెలుసుకొని అయినఖర్చుఏదో అవుతునే యున్నది. యీా సరదా కూడా

తీస్పుకుందామని తలంచి ఆ పదిరూపాయిలు టిక్కెట్టుకొని విమానముపైన షికారు బయలుదేరెను. తృటికాలములో అది మెడ్రాసు అంతయు త్రిప్పి తీసుకువచ్చేసింది.

ఆహా ! కంపెనీవాని మహిమ. ఎంత వర్ణింపదగినది ! పూర్వము ఇంద్రాదిదేవతలు గగనమార్గమున కీలురథములపైన విహరించెదు వారని వినియుంటిమిగాని నేడా మహాభాగ్యము మనకే గలుగుచున్నది. ఆహా! మానవుల జ్ఞానదృష్టికి గోచరమగున దేదియు లేదుగదా ? అని తలంచి సంతోషించి అక్కడనుండి బయలుదేరేను. ఇంతలో చీకటిపడు సమయమైనది. రాత్రికి భోజనమాశ లేదు. గాని పడక ఎక్కడనా అని ఆలోచిస్తూ బయలుదేరేను. ఇంతలో ఒకచోట గ్లోబు సినీమా అని వ్రాసివుంది. అక్కడ అనేక దీపములు వెలుగుచున్నవి. అక్కడ అనేక బొమ్మలు వ్రేలాడ గట్టబడియున్నవి. లోపల కనేకమంది జనులు వెళ్ళుచున్నారు. నేను అక్కడ నుంచే ఏమిటే, లోపల జరుగుచున్నది ? అని ఒకరిని అడిగేను. సినీమా అని వాడు చెప్పేడు. అంటే భాగవతమా ఏవూరు వాళ్లు అని నేనడిగేను. వారదివిని నవ్వుకొని కాదు బొమ్మలు చూపిస్తారు. అని వారన్నారు. నాకు చిన్నప్పటినుంచి తోలు బొమ్మ లంటే సరదా. మావూరులో అవుతే ఒట్టినే చూడవచ్చును. ఇక్కడ డబ్బు ఇచ్చుకోవలసి వచ్చిందికదా అని ఆలోచించి పట్నాల్లో యీముడుపులు ఎలాగ తప్పవని ఆ టిక్కెట్టు గదిదగ్గరకు వెళ్ళి అయ్యా నాకో టిక్కెట్టు ఇయ్యండి

అన్నాను. ఏటిక్కెట్టు అని వాడడిగేడు. నన్నుచూస్తూ అమా
గుతావేమిటి ? ఏడిసినట్టేవుంది నీతెలివి; మొగటిక్కెట్టు ఇయ్యి
అని నేనడిగేను. అదికాదయ్యా బెంచియ్యా, కుర్చీయ్యా,
సోఫాయ్యా అని వాడడిగేడు..

నామూజే నేను మోసుకోలేక చస్తూవుంటే యివన్నీ నాకెందుకు? వట్టిటిక్కెట్టు ఇయ్యిఅని నేనడిగేను. వాడెందుకో చికాకుపడి బేడపుచ్చుకొని టిక్కెట్టు యిచ్చాడు. అందు మీద (థర్డుక్లాసు) అని వుంది. నేనదిచూచి పాపం వీడు దగా చేయలేదు. అప్పుడు రైలుటిక్కెట్టుమీద యిలాగే వ్రాసి వుంది అని సంతోషించి లోపలకు వెళ్లి కూర్చున్నాను. ఇంతలో చటుక్కున దీపాలు అరిపోయాయి. నేను గబుక్కున లేచి "ఏమిరా వెధవా! పోయేకాలము దీపాలు ఆరిపేసావు. డబ్బులు యిచ్చుకొని చీకట్లో కూర్చుంటామనుకున్నావా? వేగం వెలిగించుదీపం" అని బెంచెక్కి పెద్దకేకవేసి, నా చుట్టూవున్న జనాన్ని పిలిచి యేమర్రా! వీరికి పీనుగుల్లాగ యిలా వూరుకున్నారు? మన మూరుకుంటే వాడికి ఆడిందిఆట పాడిందిపాట లాగవుంది అని నాలుగుచీవాట్లు వేసేను. చాలుచాలు కూర్చోవయ్యా అడ్డంగా నువ్వేమిటి? ఎప్పుడూ సినీమా ఎరుగవు కాబోలు కూర్చో కూర్చోమని నన్ను బలవంతాన కూర్చోబెట్టేరు. ఇంతలోబొమ్మలాట ప్రారంభమయింది. ఇవిమావూరు బొమ్మలులాగా లేవు. వీరు మాటాడకుండా మనుషులనే ఆడి

స్తున్నారు. అవిగో కనురెప్పల దగ్గరనుండి కదులుతున్నాయి అనుకొని ఆశ్చర్యంగా చూస్తున్నాను.

ఇంతలో ఎవడో వెధవ మరొకడిని గుండెలో పొడవ బోతున్నట్టు కనబడింది. నేనదిచూచి అయ్యో! పాపం ముసలి వాడు చచ్చిపోతున్నాడు. చూస్తు వూరుకున్నారేమి లెండి అని నే గబాలున లేచి "ఆగు వెధవ ఆగు, పోలీసులుకు అప్ప గిస్తాను. చూచుకో" అని పరుగెత్తుకొని వెళ్ళి వాడిమీదపడి పట్టుకోబోయాను. ఆ వెధవలంతా ఎటో పారిపోయారు. నా చేతిలో తెరగుడ్డమాత్రం దొరికింది. జనంఅంతా గొల్లున లేచి పోయారు. దీపాలు వెలిగేయి. ఇంతలో ఎవరోకంపెనీఅధికారట వచ్చి ఏయ్! తెర యెందుకుచింపేవు? యిందుకు 10 రూపా యలు యిచ్చుకోమన్నాడు.

10 రూపాయలమాటకేమి నీ సంగతి కనుక్కుంటాను వుండు. దీపాలుఆర్పి కూనీలుచేయిస్తున్నావా? యీజనంఅంతా నీలో పెరీక్కేను. మీ అందరిమీద కేసుపెట్టి డొక్క చీరేస్తాను. జాగ్రత్త! నీలో తప్పువుంచుకొని నన్ను 10 రూపా యలు యిమ్మంటావా! ఒక దమ్మిడి ఇయ్యను. నీ దిక్కున్న చోట చెప్పుకో నాకేం భయమనుకున్నావేమో; మా వూరు నాయుడు నా మాటవింటాడు. అనినేను ఘోర్సుగా చెప్పేశాను.

ఆ చచ్చుపీనుగు వూరుకోక నామాట లాగుకొన బోయాడు. నేనీ వెధవతో యిప్పుడు పేచీపడకూడదనికొంచెము శాంతపడి వాడన్న పదిరూపాయలు వాడికిచ్చి మెల్లిగా బయ

రికి వచ్చేశాను. అక్కడనుండి బయలుదేరి ఎలాగైనా తెలి వైన ముండావాడ్ని గనుక యుక్తిగా ఫోగట్టాచేస్తూ సినీమా సంగతంతా తెలుసుకొని నే చేసిన చర్యలకు సిగ్గుపడి ఎలాగ అయితేనేమి వెంకటేశ్వర పిళ్లెగారి సత్రవు చేరుకొని నా బసలో పడుకున్నాను.

మరునటికి వుదయము లేచి మా సత్రవు అరుగుమీద కూర్చుని దంతధావన చేసుకొని వీధులో కనబడే చిత్రాలు అన్నీ చూస్తున్నాను. ఇంతలో ఎవరో ఒక అరవ్వాడు వీభూదిపిండి కట్టుకొని నాక్షాత్తు శంకరుడులాగున వస్తూవున్నాడు. అతడిని చూచి నమస్కరించి యివాళ వర్జ్యాలెప్పుడు, తిథిఏమిటి అని అతి వినయంగా అడిగేను. వాడు చంకనుండి ఏదో మూట తీస్తూ "ఎన్నా సార్! షేవింగు వేణా" అని అడుగుతూ నా దగ్గరకు వచ్చాడు.

మంగలాడికి దండంపెట్టాను. ఎవరైనాచూస్తే ఫూల్ నను కుంటారేమో! అయింది ఏదో అయింది. గెడ్డామయినా గీయించుకుందాము అని ఒరే! అబ్బీ యిలారా అనిపిలిచి లాయరయేటప్పుడు క్రాపింగువుండకపోతే బాగుండదని తలంచి సౌజ్ఞగా జుట్టుఅంతా చూపించి ఫుల్ క్రాపింగు అందామను కొని ఫుల్ షేవింగు అన్నాను. ఆ మొద్దుపీనుగు మళ్ళీఅడగ కుండా బుర్రఅంతానున్నగా గీసినాడు. బుర్రమండుతుందేమా అని అద్దము లేక తలతడిమి చూసుకున్నాను. గుండె గుభేలు మన్నది. అద్దమడిగిచూచుకునేసరికి బుర్రనున్నగా గుండ్రాయి

లాగ తయారయింది. నాకు మా ఒళ్లుమండి "వెధవ! బుర్ర నీ చేతికిస్తే నీయిష్టమువచ్చినట్లు గీసేయడమేనా?జాగ్రత్త లాస్ఆఫ్ బ్యూటీ అని కేసుపెట్టుతాను" అని కేకవేశాను. "నీవే శెప్పావప్పా" అని వాడన్నాడు. 'ఒకవేళ నేను పొరపాటుగా చెప్పేను ఏమో మళ్ళీఅడగవద్దా' అని వాడ్ని నాలుగుతిట్టి వాడికో అర్ధణాయిచ్చి పొమ్మన్నాను. వాడది చాలదన్నాడు. "చాఫ్ వెధవా! నే నెరుగనా మా నాయనమ్మ గుండుకి అంతే యిస్తూ వుంటుంది. మాది పల్లెటూరని డబాయించడానికి చూడకు" అని కేక లేసి పొమ్మన్నాను. వాడెందుచేతనో గాని అర్ధణా పుచ్చుకొని అక్కడనుంచి పోయాడు.

తరువాత డబ్బులెక్కచూసుకునే సర్కి రూపాయి తక్కువవచ్చింది. అన్నా మంగలాడికి అర్ధణాఅనుకొని రూపాయిచ్చేసాను ఏందారి. అందుకే ఆ వెధవ గప్‌చిప్‌గా పోయాడు. అయినా వెతికి పట్టుకోవాలని బయలుదేరి నాకు గుండు చేసిన మంగలాడు కనుపించాడా అని అందరినీ అడుగుతూ వీధులన్నీ తిరిగాను. వాడు దొరకలేదు సరికదా సత్రములో భోజనానికి పద్దువేయించు కుందికి వేళకూడా మించిపోయింది. యింతకీ నేనింటి దగ్గరనుండి బయలుదేరిన వేళ మంచిది కాదు. యెక్కడికి వెళ్ళితే అక్కడ ఏదోచిక్కు వస్తూంది. అయినా శాంతం బోషాణంఅన్నాడు. అంటే శాంతం బోషాణంపెట్టి ఇంతమంచిది గాన ఓర్మికలిగివుండాలి అని తలంచి మానాన్నకి వ్రాసిన ఉత్తరాముకి జబాబు వచ్చిందికాదు. వెధవ ఉత్తరాం

కన్నా అర్ధణాకార్డే మంచిది. మళ్ళీ ఒకఅర్ధణా కార్డుఅయినా వ్రాసి పడాయాలని తలంచి పోస్టాఫీసుకు బయలుదేరి వెళ్ళీ అన్ని సంగతులతోను ఒక కార్డువ్రాసి పడేశాను. దారిలో వస్తూవుంటే ఒకచోట అనేకపఠాలున్నాయి. అదిఏమిటా అనిచూస్తే ఫొటోస్టుడియో అని వ్రాసివుంది. అయినా నాకు బోధపడక లోనకువెళ్ళి అక్కడున్నవారిని పిలిచి, అయ్యా ఏమిచేస్తారని నేనడిగేను. ఇక్కడఫొటోతీస్తారని చెప్పేరు. అంటేయేమిటని నేనడిగేను. యంత్రమహిమచే మీరూప పఠం తీస్తారని వాడు నవ్వుకుంటూ చెప్పేడు. అయ్యా అచ్చంగా అద్దంలో చూసుకున్నట్టు కనబడుతుందా అని నేన డిగేను. వాడవునన్నాడు. సరే నాకొక ఫొటో తీయించండి యిప్పుడు తీరుబడిలేదు రాత్రివస్తానన్నాను. వాడు రాత్రి వీలు లేదన్నాడు. నాకుమహాఒళ్ళుమండి డబ్బిచ్చుకొనేవాడను నేను పుచ్చుకునే వాడవునీవు నా వీలు నీవు చూడాలిగాని నీవీలుతో నాకేంపని పొమ్మన్నాను. మాదెంత పల్లెటూరైనా ఒకరి యిష్టమువచ్చినట్లు తిరిగే రకంకాదు జాగ్రత్తఅన్నాను.

వాడెందుకో నవ్వుకొని అయ్యా! ఫొటో రాత్రితీస్తే రాదు అన్నాడు అలాగా సరే అయితే యిప్పుడేతియ్యి ఆ మంగలాడు గుండుచేసినట్లు నీ యిష్టమువచ్చినట్లుతీస్తే ఒప్పు కోను సుమీ. వీసంవాసం తేడాలేకుండా పోకుగాతియ్యాల న్నాను. వాడు సరేఅని నాకు ఒకకోటుతొడిగించి ఒక పాగా చుట్టి ఒక కుర్చీ వేసి కూర్చోమన్నాడు. అయ్యా! నేనురడీఅన

గానే మీరు సమంగా వుండాలన్నాడు, చిన్నప్పుడు మా వూరులో డ్రిల్ నేర్చుకున్నవాడిని. ఆ పాటి తెలియదా అనుకున్నాను.

ఇంతలో వాడేదో మర సవరించుకొని రడీ అన్నాడు. వెంటనే నేను పళ్ళూకళ్ళూ బిగించి కాళ్ళుచేతులు నిగడదన్ని నించున్నాను. వాడెందుకో మొకం చిట్లించికొని ప్లేటుపాడు చేసేవయ్యా అన్నాడు. ఏం? ఎందుకు పాడయింది నీవు రడీ అన్నాక నేనొక్కనిముషమయినా ఆలశ్యంచేయలేదేలన్నాను. రేపురండి కాపీకడిగియిస్తాను అన్నాడు. అయితే డబ్బుకూడా రేపేయిస్తాను వెళ్ళుఅని చక్కావచ్చేను.

ఇంతలో సాయంత్రం అయింది. నే వచ్చేదారిలోనే ఒక బజారు కనబడింది. దానికి ఈవినింగ్ బజారు అంటారని విని ఏమేమి అమ్ముతారో చూడాలని నే నక్కడ ఆగేను. యింతలో ఎవడో జోళ్ళు అమ్మకానికి తెచ్చాడు. పట్నాలలో తిరిగేటప్పుడుషోకుగావుండాలని తలంచివాడిదగ్గరఒకజోడుబేరం చేసేను. వాడు పదిరూపాయలు యిమ్మన్నాడు. వాడిదగ్గర కొరడా లేదని ధైర్యపడి నే నొక రూపాయి యిస్తానన్నాను. వాడు మూడురూపాయలకుఒకదమ్మిడీ తక్కువఇయ్యనన్నాడు. ఎలాగైతేనేమి మెల్లిగా ఒప్పించి రెండురూపాయలు యిచ్చి పుచ్చుకున్నాను. ఆ జోడు నా కాలికి సమంగా సరిపడింది. కాని మడమలుమాత్రం మహాఎత్తుగాఉన్నాయి. అయినా అవు

గుతే అవే తగ్గుతాయని వూరుకున్నాను. ఏమోగాని నడువ గోయేసరికి కాళ్ళు తొట్రుపాటై తిరుగబడ్డాను. ఎవరూచుడ కుండా మెల్లిగా అక్కడొక వెదురుముక్క దొరుకుతే అది వూతగా చేసుకొని మెల్లిగా బయలుదేరేను.

ఇంతలో నా చుట్టుప్రక్కల జనంఎందుకో లేడీషూ, లేడీషూ అనుకుంటూ నవ్వుకుంటూన్నారు. వాళ్ళేదో ఆడాళ్ళ జోడుగురించి అనుకుంటూన్నారు. మనకెందుకు అని నే వూరు కున్నాను. యింతలో ఎవడో గోల్డుస్పెట్సు అంటూ ముక్క ద్దాలు అమ్మతెచ్చేడు. నాకు ఒక చలువజోడు కొనుక్కోవా లని బుద్ధిపుట్టి పట్టపగలు జూచినా రాత్రిఅంత మబ్బుగా కన బడే జోడు కొని పెట్టుకున్నాను.

ఇంతలో చీకటిఅయింది. కాళ్ళజోడునుంచి నడవడానికి కంటిజోడునుంచి చూడడానికి వీలు లేకుండావుంది. అయినా అదితీస్తే అలవాటు తప్పిపోతుందని సత్రవుకి బండికట్టించుకొని బయలుదేరేను.

కొంతసేపటికి సత్రవు దగ్గరకు చేరుకొని బండివాడికి అర్ధియిచ్చిపొమ్మనీ మెల్లిగాగుమాస్తాగారి గదిలోచేరి అయ్యా యీ పూటకి తమరు తప్పకపద్దు వేయించాలి అన్నాను. ఆయన సరేయని ఏమిటి పంతులుగారు రాత్రి మబ్బుజోడు పెట్టేరు. కనబడుతోందా అన్నాడు. నిజంగా నాకు జోడు కనబడడం లేదుగాని తీస్తేషోకు చెడిపోతుందని ఆలోచించి ఆ కనబడకేమి అన్నాను. ఆ ముండావాడు వూరుకోక ఏమిటంటో పంతులు

గారు ఆడాళ్ళజోడు కొన్నారు అని నవ్వుకుంటూ అడిగేడు. ఇందాక బజారులో కూడా యిందుకే నవ్వుకున్నారనుకొని నేచేసిన తెలివితక్కువకు విచారించి, అబ్బే కొనలేదండీ మా స్నేహితురాలొకామె దాచిపెట్టమని బండిలోపడేసింది. జోడు చేతితో తేడమెందుకని తొడిగి తెచ్చాను. అని గమ్మత్తుగా కమ్ముకున్నాను.

రాత్రికి అక్కడ హాయిగా భోంచేసి పడుకొని తెల్లవారుగట్లలేచి ఎవరూచూడకుండా జోడు కాయితంలో పొట్లం కట్టి తీసుకువెళ్ళి సముద్రములో పారేశాను. యింతలో మా సత్రంగుమాస్తా కూడా ఎందుకొచ్చాడో నన్ను కలుసుకున్నాడు. ఆయనతో మాటలాడుతూ వస్తూవుండేసరికి వెధవ కెరటాలచేత కావలెను నాజోడు మళ్లీ ఒడ్డుకు కొట్టుకొచ్చింది. అన్నా యీతడుచూస్తే అడుగుతాడురా భగవంతుడా అనుకొని బెంగపడ్డాను గాని ఆయన ఏదో గొడవలో యిది చూడలేదు. వెంటనే అక్కడనుండి బయలుదేరి యింటికి వచ్చాము. ఏమండీ పంతులుగారు కళ్లజోడు అద్దము బద్దలయింది అని మా గుమాస్తాగారు అడిగేరు. ఏమో రాత్రి పెట్టుకొని పడుకుంటే నిద్దట్లోఏదో దెబ్బతగిలి వుంటుందిఅన్నాను. నిద్రపోతూ కళ్లజోడు ఎందుకయ్యా అని వాళ్లు నవ్వేరు. నాకు మహాఒళ్ళు మండి డబ్బులేని వెధవలకు పోతుందని బెంగకాని నాకేమి? పోతేపోతుంది. నాగొడవ మీకెందుకు వూరుకోమని మహాకోపంగా చెప్పేశాను. పాపం ఆగుమస్తా నామీద ఏమీ కోప

గించుకోకుండా నాతో చాలా ప్రేమగా మాటాడుతూ నాకు భోజనమేర్పాటు కూడా సత్రవులోనే చేయించాడు. నేను భోజనంచేసి కొంతసేపు పడుకొనిలేచి మా సత్రవు గుమాస్తా గారితో కలిసి షికారు బయలు దేరేను.

ఆయన నన్ను తిన్నగా సర్కస్ చూద్దాంరమ్మని నన్నొక గుడ్డయింట్లోకి తీసుకు వెళ్ళేడు. ఇద్దరంకలసి అక్కడున్న కర్ర మెట్లమీాద కూర్చున్నాము. యీా సర్కస్ అంటే ఏమిటో నాకు బోధపడలేదు గాని యిలాంటి చిన్న విషయాల్లో ఎవర్ని అడిగినా బాగుండదని చూస్తే తెలియకపోతుందా అని ఆలోచించి వూరుకున్నాను. ఇంతలో సర్కస్ ప్రారంభించారు.

కొందరు ఆడవాళ్లు, పిల్లలు, మొగవాళ్లువచ్చి మొగ్గలు వేయడం, గెడలెక్కడం, వుయ్యాలూగడం మొదలైన పనులేవో చేస్తున్నారు. సర్కస్ అంటే యింతేనా యింకా ఏమిటో అనుకున్నాను. మావూరిలో వీటెవాళ్ళు యింతకన్నా ఎక్కువ విద్యలు చేస్తారు. వెధవ పట్నాలలో డాబుసరిచేసి డబ్బు లాగుతారు. అని విసుగుకొంటూ చూస్తున్నాను.

ఇంతలో కొన్ని గుర్రాల్ని తీసుకువచ్చి అక్కడెవడో మాగొప్పగా వాటిని మూడుకాళ్ళతో నడిపించాడు. ఇదో గొప్పేమిటి? మాఊరు మునసబుగారి గుర్రము ఎప్పుడూ మూడుకాళ్లతోనే నడుస్తుంది అని మా ఫ్రెండుతో చెప్పేను. ఆయన ఎందుచేతన్నాడు. ఏమీా లేదు దాని నాల్గోకాలు విరిగి పోయింది అని నేను చెప్పేను.

ఇంతలో గుర్రాలు వెళ్లిపోయాయి. ఎందుకో గాని అక్కడ చుట్టూ గజాలు కట్టేరు. ఎందుకా యిది యని నేను చూస్తూవున్నాను. ఇంతలో ఎవడో ఒక పెట్టెతలుపు తెరచేసరికి కాండ్రుమంటూ ఒకపులి క్రిందకురికింది. అన్నా! చంపేవురా వెధవా అని పెద్ద కేకవేసి దిగ్గునలేచి నించున్నాను. ఈ హడా విడిలో కాలుజారి అవతలవున్న ఆడవాళ్లమీద పడ్డాను. ఆ వెధవలు వూరుకోక సరదాచేతనో, కోపంచేతనోగాని నన్ను క్రిందికి తోసేశారు. ఇంతలో ప్రజలంతా గొల్లున లేచిపో యారు. ఈ గోలకాపులి వూచలుదాటి బయటపడింది. అప్పుడు ప్రజలుపడిన కంగారు ఏం అని చెప్పను! వూడిపోయిన గోచీ వూడినట్టేవుంది. కొందరికి విడినజుట్టు విడినట్టేయుంది. కొందరు పిల్లలనువొదిలి తల్లులు, తల్లులనువదలి పిల్లలు, మొగుడునొదిలి పెళ్ళాం, పెళ్ళాన్నివదిలి మొగుడు ఎవడిప్రాణం కాపాడుకోవా లని వాడు కంగారుపడి కచ్చాలిప్పుకొని పరుగెత్తేరు. నాకు పారిపోవాలనే వుందికాని ఆ బల్లమధ్యపడి యిరుక్కుపోయి కదలలేక పడుస్తున్నాను. జనంఅంతా పారిపోయారు. నేనొక్క డిని వుండిపోయాను. ఏమిదారి అనుకుంటూ వుండేసరికి పాపమా సర్కస్‌వారే యిద్దరువచ్చి నన్నా సందునుండి బయటకీడ్చేరు. కొంచెము చీరుకుపోయింది కాని మరేమీ ప్రమాదము జరుగ లేదు. ఆ సర్కస్ వారిని పిలిచి కొంచెము నూనెచుక్క యిమ్మన్నాను. గాని ఆ వెధవ ఇయ్యకుండా బద్మాష్ జావ్ అన్నాడు. అంటే నూనెలేదన్న మాటగదా అనుకొని వెళ్లిపో

వచ్చాను. మా సత్రపుగుమాస్తాగారు ఏమయ్యారో తెలియ లేదు. అప్పుడే రాత్రిసుమారుఎనిమిదిగంటలయింది. నేబయలు దేరి యింటికిపోవాలనుకొని ఒకమనిషి ఈడ్చే బండినెక్కి బయలు దేరేను. ఎప్పటికినీ సత్రవు చేర లేదనితలంచి బాగా తోలాలని వూహించి చేతిలోని బెత్తంతో బండినీడ్చే వాడినో రెండు కొట్టేను.

ఆ వెధవ బండిఆపి ఎన్నాఅయ్యాయిది అని గిరీసంగారి మరియాద అయినా ఆలోచించకుండా బెత్తమూడలాగినాలుగు తగలనిచ్చి దిగి పొమ్మన్నాడు. ఈ వెధవకి ముందు అద్దెఇచ్చి వేయడం నాది తప్పు అయిపోయింది. కొట్టిన వెధవ కొట్టేడు గాని మెల్లిగా అయినా కొట్టేడుకాడు. ఈ వెధవని యిలావిడిచి పెట్టకూడదు. కేసుపెట్టి డొక్కచీరేయాలని తలంచి బయలు దేరి మెల్లిగా సత్రవుకు వచ్చాను. ఇంతలో రాత్రి అయింది. గుమాస్తాగారి దయవలన సత్రవులో భోంచేసి పడుకుందామని నాబసలోకి వచ్చాను. అక్కడ వెలుగుతున్న గాజుబుడ్డి బాగు లేదు. చిమ్నీ తుడవాలని తలంచి తీయబోయాను. ఒకంతట రా లేదు కాని వదలకుండా వూడలాగేను. ఆదీపం ఆరిపోయింది. అగ్గిపుల్లతో యెన్నిసార్లు వెలిగించినా వెలిగిందికాదు ఇంతలో మా గుమాస్తాగారువచ్చి యిది కిరసనాయిలు బుడ్డికాదు. ఎలక్ట్రిక్కులయిటు. బల్బు పాడుచేసేవు. అని కోపగించి మరొకబుడ్డి తగిలించి దీపం వెలిగించాడు. తరువాత నేను హాయిగా పడుకున్నాను. మరునాడు లేచాను. ఆవేళ యెందు

చేతనోగాని ఒంట్లో సుస్తీగా వుండుటచే ఎక్కడికీ కదలడము యిష్టము లేక మా ఫ్రెండుతో మాటాడుతూ కూర్చుని ఆ పూటాకూడా సత్రవులో సాపాటు చేసేశాను. నాకీ ఊరులో యేమి తోచకుండావుంది. ఏమిచేయడం అని మా గుమాస్తా గారి నడిగేను. ఆయన ఈ వేళ హార్బరుకి షికారు వెడదా మన్నాడు. హార్బరంటే ఏమిటి? అక్కడ చల్దిఅన్నం దొరుకు తుందా అని నే నడిగేను. ఆయ నెందుకో నవ్వుకొని అక్కడ చల్దిఅన్నందొరకదు; వేడన్నందొరకదు అక్కడికిఅనేకరకముల స్టీమరులన్ని వస్తాయి. ఒడ్డునుండే ఓడలోకి వెళ్లవచ్చునన్నాడు. పడవ ఎక్కడమంటే నే నెరుగకపోలేదు. మాకుసమీపంలో మడపాం రేవులో చాలాసార్లు యెక్కేను అన్నాను. ఓడంటే చిన్న పడవకాదయ్యా పెద్దవూరంతుంటుంది. దానిమీద మా వూరక్కడకు తెప్పించగలరా ? కావాలంటే కానో అర్ధనో యిచ్చుకుంటాను అని చెప్పేను.

ఆయన పక పకనవ్వి వూరుకోవయ్యా. ఊరు యేలాగు వస్తుంది. నీకన్ని సంగతులు చూపిస్తేనేగాని బాగులేదు పద అని నన్ను తక్షణంప్రయాణంచేసి ఒకచిన్న మోటారుఎక్కించి బయలుదేరించాడు. అంతకుముందనేక మోటారులుచూచాను గాని ఎప్పుడూ ఎక్కలేదు. ఆవేళ ఆమోటారులో వెళుతుంటే వూరంతా చూడవచ్చు ననుకున్నాను గాని, అందులోవున్న మెత్తని పరుపులచేతను చల్లగాలిచేతనూ నావొళ్లు నే నెరుంగ కుండా నిద్రపట్టేసింది. ఇంతలో కారుఆపి మా గుమాస్తాగారు

నన్ను లెమ్మని లేపేరు. నే బలవంతాన ఆయనతో వెళ్ళి ఆ పేడల చిత్రాలన్నీ చూచివచ్చాను. తిరిగిమేము యింటికి వస్తూవుంటే దారిలోఒకచోట ఇచ్చట కుశలవ నాటకమాడబడును అని వ్రాసివుంది. నాటకం చూద్దాంరమ్మని గుమస్తాగారు లోపలికి వెళ్ళేసరికి హాలంతా జనంతో కిటకిట లాడుతూవుంది. మేము కొసన రెండుకుర్చీలువుంటే వాటిమీద కూర్చున్నాము కాని నే కూర్చున్నకుర్చీకి ఓకాలు అవుకుగావుంది. పక్కనఅంతా ఆడవాళ్లేగాని మొగాళ్లు ఎవరూలేరు. మా వూరులోలాగా కాదు. యీవూరులో ఆడవాళ్ళంతా నాటకాలికివస్తారు. పోనీ వస్తే వచ్చారు. యీ పెళ్ళి ముస్తాబెందుకు అని నాలో నేను అనుకున్నాను. ఇంతలో జనులంతా చప్పట్లవర్షము కురిపించారు. ఇంతలో గణగణమని గంటవాగింది. మా గుమాస్తాగారిని పిలిచి పదండి పోదామన్నాను. ఎందుకేమిటి? ఎక్కడికి అనిఆయన నన్నడిగేడు. నేనేమి ఫూల్ననుకున్నారా యీపాటి ఎరుగనా గంట కొట్టగానే యింటికి వెళ్ళడమని నాకు తెలియదా చిన్నప్పటి బళ్లో సంగతులు మరచిపోయానా అనినేనన్నాను. ఆరూలు యిక్కడ పనికిరాదయ్యా యిక్కడ గంటకొట్టగానే నాటకం ప్రారంభిస్తారు అని ఆయనచెప్పేడు. ఇంతలో తెరఎత్తేరు. మావూరిలో భాగవతులు నాటకమాడి నప్పుడు తెరఎత్తగానే తడక కనబడేది ఇక్కడఅలాగున కాకుండా పెద్ద మహాల్ కట్టేరు అని ఆశ్చర్యపడి ఆ సింహాసనముమీద కూర్చుండేది ఎవరనినేను మా ఫ్రెండు నడిగేను. అతడే శ్రీరామ

చంద్రమూర్తి; తక్కినవారు అతనితమ్ములు అని ఆయన చెప్పేడు. రాములవారికి కూడా యీ సగం మీసం గొరిగించుకునే తెగులేవుండేదా అని నేనడిగేను. ఇతడు నాటకంలో రాముడని ఆయన చెప్పేడు. ఈ బోడిబుర్ర లక్ష్మణుడుకూడా ఆరకంలోనివాడేనా అని నేనడిగేను. ఆయన అవునన్నాడు. కొంత సేపటికి వాళ్లేదో స్టేజిమీద చస్సుబుస్సులాడుకొని అవతలికి వెళ్ళేరు. యింతలో తెర పడింది. ఇంతలో ఏదో పొట్లం దభీలుమని నాఒళ్లోపడింది నేగతుక్కుమని అదివిప్పిచూచాను. అప్పుడు నాకు మహాఆనందం కలిగింది. ఎందుకంటే దానినిండా అన్నిరకముల మిఠాయి కట్టివుంది. ఎలాగైనా నే అదృష్టవంతుడను అనుకొని హాయిగా నేనూ మాపెండ్రు తినివేసాము. ఈపొట్లం ఎలాగ పడిందా అన్న ఆలోచనమాత్రం మా యిద్దరికి వదలలేదు. యింతలో మాప్రక్కనెవరో డబ్బుదండగఅయిపోయిందిరా పొట్లంవీళ్ల కందిపోయింది! పాపం తినడానికి దానికి అదృష్టంలేదు అనుకొంటున్నారు. పొట్లాం వీళ్లదికాబోలురా దేముడా కొంపతీసి డబ్బు అడుగుతారేమో ఏందారి అనుకుని ఆ వెధవలకి కనబడకూడదని తలంచి కుర్చీక్రిందదూరేను. ఇంతలో మా గుమస్తా కేకేశాడు. ఏమిటయ్యా ఒంగున్నావు, లెమ్మన్నాడు. నే లేవాలనుకున్నాను గాని లేవలేకపోయాను. ఏమంటే కుర్చీకర్రలో దూరిన బుర్ర చిక్కడి రావటంలేదు. యీగింజుకోవడములో ఆకుర్చీమీద కూర్చున్నతను ముందుకు తిరుగబడి మా కోపంగాలేచి చేతిలోవున్న కొరడాతో నన్నో

రెండు కొట్టేడు. నే మొర్రో మొర్రో మనేసరికి చుట్టూవున్న జనం అంతా మూగేరు. అడావిడిలో ఆడవాళ్ళు అవతలికి పరుగెత్తారు. నేమెల్లిగా తంటాలుపడి లేచినిలబడ్డాను. ఇంతలో ఎవడోవచ్చి అందరినీ కూర్చోబెట్టాడు. కొంతసేపటికి తెర లేచింది. ఇంతకుముందు ఏదో అంకములయినవో చూడలేదు. గాని అప్పుడా అడవిసీనులో ఒక ఆమె ఏడుస్తూ కనబడింది. ఆవిడ సీతాదేవిగారుఅని మా గుమాస్తాగారు చెప్పేరు. సీతా దేవికూడా వేషములోపము చేయలేదు. పవిటపిన్ను బాగానే పెట్టింది అని నేననుకున్నాను. ఏమయినా నాకు నాటకమంటే అట్టేనచ్చలేదు. గాన మా ఫ్రెండును పిలుచుకొని యింటికి వచ్చేశాను. మరునా డుదయం లేచి బట్టలు కొనుక్కోవాలని తలచి మా గుమస్తాగారిని బజారునకు రమ్మన్నాను. ఆయన ఆపూట రాలేనన్నాడు. పోనీ నాకేం తెలియదు గనుక నేనెళ్లి కొందామని బయలుదేరేను. ఇంతలో సమయానికి ట్రాంకూడా వచ్చింది గనుక చకచకా పోవచ్చునని అదియెక్కి వెళ్ళేను. కొంతసేపటికి ట్రాం వెళ్ళి బజారులో నిల్చేసరికి నేనక్కడ దిగి యెదురుగుండా యున్న కొట్టులోనికి వెళ్ళేను. అక్కడ అన్నీ సీసాలేగాని యేమీ కనబడలేదు. అయినా అడిగిచూదామని అయ్యా! మంచిమల్లు గజం ఎంత? అని నేనడిగేను. అంటే వాళ్లెందుకో నవ్వుకొని యిది డ్రగ్‌హౌస్, యిక్కడ బట్టలు దొరకవన్నారు. అంటే ఏమిటో బోధపడలేదునాకు. గాని ఒక వేళ చల్దిఅన్నము దొరుకుతుందేమో అడుగుదా మను

కున్నాను. గాని సిగ్గుపడి వచ్చివేశాను. ఇంతలో అలాకొంత దూరము వెళ్ళేసరికి అక్కడ వరుసగా కొన్ని బట్టల కొట్లు కనబడ్డాయి. నేనొక కొట్లోకి వెళ్ళి మల్లుగుడ్డ తీయమనేసరికి యెవరో ఒకఆమెవచ్చి నన్ను పట్టుకొని సోదరా! యిది నీకు న్యాయమా? మా అవస్థలు చూచి అయినను కనికరము పడవా అని ప్రారంభించింది. నేను హడలిపోయాను. "ఏమిటామె యిలాఅంటూంది? నేనేమిచేశాను? ఈమెను ఎప్పుడూ చూడనయినా చూడలేదు. నేచేసిన అన్యాయ మేమిటి" అని ఆలోచిస్తున్నాను. ఇంతలో మరికొందరు స్త్రీలు, పురుషులు నన్ను చుట్టవేసి, నాయనా దయుంచవా! నామాట మన్నించవా! యీపాటి దేశసేవ నయిననూ చేయవా? యింకనూ ఖద్దరుకట్టవా? అని యేమేమో చెప్పిరి. ఇక వీరితో గొడవెందుకని ఆ బట్టలుకొనడం మాని చక్కావచ్చాను. అక్కడ నుండి బయలుదేరి తిరిగితిరిగి ఒక ఖద్దరుకొట్లోకి వెళ్లి పంచలూ, కండువాలూ చొక్కాగుడ్డలూ కోటుగుడ్డలూ కొని మాఅమ్మ యిక్కడ లేదుకదా, చొక్కాలు ఎవరుకుడుతారా అని ఆలోచిస్తూ వస్తున్నాను. అలాకొంతదూరము వచ్చేసరికి ఎవరో ఒకాయన నాకు నమస్కరించి అయ్యా! బట్టలుఒకసారి చూడనియ్యండి అని నాచేతిలో మూటలాగుకొని విప్పి చూచాడు. ఆయనచేతిలోనుండి మరియొకరు, వారిచేతిలోనుండి ఇంకొకరు ఇలా పదిమందివరకూ దాటించారు. నేనింటికి తొందరగా పోవాలని మూట యిచ్చేయమన్నాను. ఆ మొద్దుపీనుగు

మాట ఇవ్వక నా స్వంతానికి కొనుక్కున్నాను; నీ కమ్మను పొమ్మన్నాడు. నేనా మాటవిని ఆశ్చర్యపడి లబోలబో మంటూ అందరినీ పిలిచి తగూ పెట్టాను. వారందరియెదుట కూడా వాడాబట్టలు తనదేనంటాడు. తానవికొన్న కొట్టుకూడా చూపిస్తాంటాడు అనెక్కడకొన్నావో చూపించగలవా అనివారు నన్నడిగారు. నే చూపించగలను. నేను రూపాయలిచ్చిన కొట్లోనే కొనుకున్నాను. కావాలంటే వెళ్ళి చూచుకోండి అన్నాను. యెంత పేచీపడ్డా ఆవాజముండావాడు బట్టలీయ కుండా పట్టుకుపోయాడు. యీ వేళ యెవరిముఖం చూచానో గాని పదిహేను రూపాయలు దండగయిపోయింది అని విచారిస్తూ సత్రవుకు బయలుదేరేను. నే బసకు వచ్చేసరికి మా నాన్నవద్దనుండి ఒక కవరు వుత్తరంవచ్చింది. అది నేవిప్పి చూచేసరికి అందులో యిలా వ్రాసివుంది.

"శ్రీరస్తు చిరంజీవులయిన మా కుమారుడు అయిదర్లల గిరీశమును మీనాన్న దూర్వాస సోమయాజులు చిరాయువులుగా దీవించి వ్రాయునది. నీవు లోగడ వ్రాసినకార్డు అందినది; దాని ప్రకారం నీకు నేను పంపిన రెండు వందరూపాయలు నీకు అందియే యుండును. టెలిగ్రాము పంపినాననీ వ్రాసినావు, నాకది అందలేదు. నీవు ప్లీడరు వౌతున్నావని విని మన వాళ్ళంతా సంతోషిస్తున్నారు. మీ మామకూతురు వెంకట లక్ష్మి సోమిదేవిని నీకిచ్చి పెండ్లిచేస్తారని మీమామ అంటూన్నాడు. నిన్నడగందే యేమాట చెప్పజాలనని మీ మామతో

చెప్పివేశాను. పెళ్ళివిషయంలో నీ వుద్దేశ మేమిటో తెలియజేయ వలసినది. పదిరోజులలో మనవూరు అమ్మవారు పండుగ చేస్తారు అందుకునీవు తప్పక బయలుదేరి రావలసింది. ఇక్కడ అంతా క్షేమం. అక్కడ నీక్షేమం వ్రాయించ వలసింది. మనవాడు మరొకడు లాయరవాలనీ ఉద్దేశ పడుతున్నాడు. ఆ వూరు రానక్కరలేకుండా లాయరు అయె పద్ధతుంటే వ్రాయించవలసినది. మన బోడావు యీనింది. నీవీసారి జున్ను తినడానికి లేవనీ మీ అమ్మ చాలా విచారించింది. ఇంతే సంగతులు. గ్రహించవలెను."

ఇట్లు

అ. దూర్వాస సోమయాజులు.

ఈ మానాన్న వ్రాసినవుత్తరం చదువుకొనీ ఏం తెలివి గావుంది వుత్తరం? యీవూరు రానిదే లాయరెల్ల అవుతాడు? అందుకే విలేజిబ్రూట్ అంటారు. లాయరవడమంటే యింట్లో కూచుని వేదం చదువుకోడంకాదు. ఇంతటి గిరీశంగారికే బహు కష్టంగావుంది. అని నాలో నే ననుకున్నాను. ఇంతలో మా సత్రవు గుమాస్తాగారు నన్నుపిలచి ఏమండీ! లైంజూన్ పుచ్చుకుంటారాఅని ఏదో బుడ్డికొట్టిచ్చాడు. ఏమిటాఅది అని నేను తాగిచూచాను. మా రుచిగావుంది. రోజూసత్రవులో మంచినీళ్లు మానేస్సి యివే యిస్తే బాగుండు ననుకున్నాను. ఇలా కొంతసేపయేసరికి రాత్రి అయిందికాని ఆవేళ వెన్నెల మాత్రం పుచ్చపువ్వులా వుంది. భోజనానికి చాలా లైముంది

ఒక ఘడియ చల్లగాలికి షికారు తిరిగి వద్దామనుకుని బయలు దేరేను. దారిలో ఒకచోట టావరిస్ షాపుఅని వ్రాసివుంది. అంటేఏమిటో నాకు బోధపడలేదుగాని అక్కడన్నీ సీసాలు కనబడుతున్నాయి. అనేకమంది గ్లాసులో ఏదో పోసుకొని తాగుతున్నారు. నేను ఆ లోపలికి వెళ్ళి ఆ షాపకీపరును పిలచి అయ్యా! నాకు ఒకబుడ్డి యిప్పించండి అన్నాను. వాడు ఏమి బుడ్డి కావాలిసార్ అన్నాడు. ఇందాక మా గుమస్తా గారు చెప్పినపేరు జ్ఞాపకం లేక మా సత్రవు గుమాస్తా గారిచ్చిన బుడ్డిలాంటిదే అని చెప్పాను. వాడెందుకో నవ్వుకొని ఒకబుడ్డి చేతికచ్చి రెండురూపాయలు ఇమ్మన్నాడు. ఇంతడబ్బే మిటి ? కొంచెం యేమైనా తగ్గించాలని చాలసేపు బేరం పెట్టా నుగాని ఆమూలముండా కొడుకు విన్నాడుకాడు. బుడ్డిపుచ్చు కుని మళ్ళీయిస్తే తంతాడేమో అని కొంచెంజడిసి విధిలేక ఆ రెండురూపాయలు యిచ్చిపుచ్చుకున్నాను. సత్రవులో భోజ నానికి లేటయి పోతుందనీ పరుగెత్తాను. నేసత్రవు కొచ్చేసరికి మా ఫ్రెండు అక్కడలేకపోవడంచేత ఆయనొచ్చాక ఆయన కివ్వవచ్చునని ఆయనగదిలో గ్లాసుతీసుకుని వెళ్ళి నేకొన్న బుడ్డి లో లైంజూస్ కొంచెం అందులో వేసుకొని అన్నా యీ పేరిందాక జ్ఞాపకం వచ్చిందికాదు వాడు అడిగితే చెప్పలేక పోయాను అని కొంచెం విసుగుకొని అది తాగేశాను. కాని ఏదో పొరపాటుపడ్డానురా బాబు గుమస్తాగారిచ్చిన లైంజూస్ యిదికాదు కొంపతీసి ఇదే విషమైనాకాదుకదా అనిబెంగపట్టు

కుంది. ఇంతలో ఇల్లువాకిలి తిరుగుట ప్రారంభించింది. మనసులో ఏదో వికారం ప్రారంభించింది. నాకేంతో చక కంగారు కలిగి అయ్యోనాయనా, చచ్చావురా గిరీశం వంశాని కొక్కడ వున్నావురా బాబూ యీ దిక్కుమాలిన లాయరవడానికి ఎందుకొచ్చావురా నాయనా, అని గొల్లుమని యేడవడం ప్రారంభించాను. ఇంతలో మా ఫ్రెండు సత్రవుగుమస్తాగారు, ఇంకా సత్రంలో వున్నవాళ్లందరు పరుగెత్తుకువచ్చి ఏం బాబూ ఏమిజరింది, యేమిటిసంగతి అని అందరూ అతి కంగారుగా అడిగారు. ఇంకేముంది ఈ వేళతో గిరీశంగారి పని సరి. అయ్యా గుమాస్తాగారు! చచ్చిపోతున్నాను దయమాత్రం వుంచండి. అదుగో విమానం ఒస్తోంది. వెళ్ళిపోతా నన్ను మరచిపోకండి దయుంచి ఉత్తరమైనా వ్రాస్తూవుండండి అని మా ఫ్రెండును కౌగలించుకొని గొల్లుమని యేడ్చాను.

యేమిటయ్యా యీగోల యేంచేశావు? ఈ చావెందుకని ఆయన అడిగేరు. ఎదురుగుండాచూస్తూ అడుగుతారేమిటి లైంజూస్ అనుకొని విషంకొని తెచ్చుకొన్నాను. మీరొచ్చిందాకాఐనా వుండక తాగేశాను. కాళ్ళూచేతులూ లాక్కొస్తున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. ఇంకెందుకు మరి బతకను అనివేడ్చి తిరగబడ్డాను. ఇంతలో మా ఫ్రెండాసీసా తీసిచూచి ఓరి ముండావాడా బ్రాందీ త్రాగేశావా! కోతికి కొబ్బరికాయలాగ నీకీబుద్ధి యెవడిచ్చాడు? అయ్యా! ఏడవకండి ఫరవాలేదు. ఇది విషముకాదు. నీ ప్రాణికేమీ ఫరవాలేదు. యిది బ్రాందీ

అనే ఒకమత్తుపదార్థము. దీనివల్లచచ్చిపోరు. ఫరవాలేదనిలోప లికి వెళ్లి కొంచెంమజ్జిగ తెచ్చియిచ్చి యిది పుచ్చుకోండి. యిందులో మందుకలిపాను ఫరవాలేదని చెప్పాడు. నేనది త్రాగి ఓగంట మత్తుగా పడుకున్నాను. తరువాత లేచి చావ లేదయ్యాబాబు బ్రతికించావు నీకో దండం నీపెద్దలకో దండం అని గుమాస్తాగారిని చాలా మెచ్చుకున్నాను. ఆయన పాపం అర్ధరాత్రప్పుడింత అన్నం పెట్టించాడు. నేను భోంచేసి పడు కున్నాను, మరునాడుదయం లేచాను. శరీరంలో మామూలు గానేవుంది. ఈవేళ ఒక గొప్పగండం గడిచింది. యిక మరి నాకు ఫరవాలేదు. అనుకున్నాను. ఇంతలో మా సత్రవులో రాత్రి దొంగలు కన్నము వేశారని గుమాస్తాగారు నన్నుపిలిచి అయ్యా! లోపలికివెళ్ళి టెలిఫోనులో పోలీసుకు చెప్పండి అన్నాడు. అక్కడే రెండుగొట్టాలుంటే యెందులో మాటా డమా అని ఆలోచించి ఏదైతేనేమి అని "వెంకటేశ్వరపిళ్ళా గారి సత్రవుదగ్గరికి అర్జంటుగా రావలసింది." అని ఆ యెర్ర గొట్టములో చెప్పేశాను.

ఓ పావుగంటలో ఏదో గణ గణ మని పెద్దగంట వాయిస్తూ నాలుగేసి గుర్రాలు పూయబడిన బళ్లురెండు చక్కా వొచ్చాయి. దానిమీదేనో టేంకులు, ఇంజనులు వున్నాయి. ఏమిటా అవి అని నేనాశ్చర్యంగా చూస్తూన్నాను. అంతలో ఎవడో దొరొచ్చి మా గుమాస్తాగారితో ఏదో దెబ్బలాడు తున్నాడు. నేనది చూచి పాపం యీాయనే తెలివితక్కువపని

చేసేదో వెళ్ళి సర్దుబాటు చేదామని బయలుదేరేను. ఇంతలో ఆయన నన్ను చూచి మహాకోపంగా కొంప ముంచావయ్యా పోలీసుని పిలవమంటే ఫైరు కంపెనీవారిని పిలిచావా అనవసరంగా వీరిని పిలిచినందుకు యిప్పుడు 50 రూపాయలు ఫైను యిచ్చుకోవాలి యేందారని గోలెత్తాడు. నేచేసిన తెలివి తక్కువకు చాలా విచారించి నా ప్రాణం రక్షించిన ఫ్రెండుకు యిలాంటి దండుగ కలగనీయ కూడదని తలంచి నేనా 50 రూపాయలు తెచ్చిచ్చేశాను. ఆ వొచ్చిన వెధవలు వాళ్ళ బాబుగారి సొమ్ములాగ పట్టుకుపోయారు. అక్కడనుంచి వీధిలోకి వెళ్ళేను. అవతల రోడ్డుమీద ఒక కొట్టుదగ్గిర చాలామంది జనంఅంతా మూగియున్నారు ఏమిటో అది చూచి రావాలని నేను బయలుదేరి వెళ్ళేను. అక్కడ ఏవో వస్తువులన్నీ వేలంపాడుతున్నారు. ఏమేమి వస్తువులు వేలం పాడుతారో చూద్దామని తలంచి నేను అక్కడ నుంచున్నాను. ఇంతలో ఒకడు ఓకుక్కగొలుసు చూపించి అది అసలైన సీమవెండి గొలుసు అచ్చంగా వెండిలాగుంటుంది మూడు బారల పొడుగుంది. అసలయిన కొత్తగొలుసు ఇది కుక్కనికట్టడానికే గాక మనిషినికట్టడానికికూడా చాలును. ఈగొలుసు వేలంలో పాడువారికి గొలుసిచ్చేయడమే కాకుండా అసలైన వూరకుక్క గూడా వుచితంగా యీయబడును. సర్కారుపాట 10 రూపాయలు అని కేకవేశాడు. ఇంతలో యెవడో పన్నెండు రూపాయలన్నాడు. వెంటనే మరొకడు పన్నెండున్నర అని కేకవే

శాడు. పాటదారుడు అర్థల్లేవన్నాడు. సరే పోనీ అని పద మూడు రూపాయిలికి పాడేరు. అలా అంతకంతకీ పాట క్రమంగా హెచ్చిపోతోంది. నాకిది చూచేసరికి మహా ఆశ్చర్యం కలిగి యీ వెధవలంతా ఫూల్స్‌లాగున్నారు. లేక పోతే కుక్కనికొనడం యేమిటి? యిందుకే వేలం వెర్రి అంటారు. మావూరొస్తే వందకుక్కలు వీళ్ళందరికి వట్టినే యిద్దును. అని నాలో నేననుకున్నాను. ఇంతలో పాట 18 రూపాయలువరకూ పాకింది. ఆఖరుమాట 20 రూపాయలిస్తే యిస్తానని పాట దారుడు కేకవేస్తున్నాడు. ఏం ఆశగావుంది, తోత్తుకొడుకుకి యెవడిస్తాడని నేననుకున్నాను. ఇంతలో యెవరో ఒక చెమిటాయన నాదగ్గరకువచ్చి అయ్యా! ఎంతకిస్తానంటు న్నాడు అని నన్నడిగాడు. ఇరవై రూపాయలని నే చెప్పేను. వాడు వినబడలేదన్నాడు. నేను మళ్ళీ చెప్పేను. యింకా వాడికి వినబడలేదనేసరికి యిరవైరూపాయలని ఘట్టిగా కేకేసిచెప్పేను. ఇంతలో ఆ వేలం పాటదారుడు నాదగ్గరకువచ్చి అయ్యా పాట మీపేర కొట్టేశాం. ఇదుగో, యీగొలుసూ కుక్కాపుచ్చు కొని యిరవై రూపాయలిప్పించండీ అని నన్నడిగాడు నాకెం దుకీ వెధవకుక్క యెవడు కావాలన్నాడు? ఒద్దు పొమ్మన్నాను. ఇరవైరూపాయలని మీరు కేకవేసిపాడలేదా? పాటకొట్టేశాక మళ్ళీ బేర మెందుకు అబద్ధం ఆడితే తప్పౌతుందనుకున్నారా – ఒక్కదమ్మిడియైన ఒదిలిపెట్టను. డబ్బిచ్చి మరీ కదలండన్నాడు. నాకు కావాలని పాడేనా? ఎంతకిస్తాడని యెవడో చెమిటతను

అడిగితే చెప్పేను. వాడికి వినబడలేదంటే గట్టిగా కేకేశాను అన్నాను. అయినా ఆ చచ్చుపీనుగు నామాట లెక్క-సేయక డబ్బియ్యందే వల్లకాదన్నాడు. ఆచుట్టుపట్లనున్న వెధవలంతా వాడిలో షెరీకై పాటపాడిన తరువాత డబ్బిచ్చితీరాలి. యీ వేషాలుమాని డబ్బిచ్చేండి అని నామీదే కేకవేశారు. ఈ దిక్కు-మాలిన వెధవలు వొదిలేలాలేరు; యీవ్రూరైపోయింది. మావ్రూరైయుంటే ఈ మాదిగాడి కొడుకులందరిని మట్టంచేసి వుందును యిప్పుడేమనుకుంటే యేం లాభం అని బొడ్డునున్న మూటవిప్పి ఆ చవట పీనుగుల కాయూపాయలిచ్చేశాను. ఈ కుక్క- కూడా యెందుకు తిండిదండుగ దీనిగజ్జి అంటుకుంటే వదలదు; ఇదంతా మా(ఫెండుకి తెలిస్తే తిడతారు కూడాను. అని ఆకుక్క-ను వొదిలేసి ఆగొలుసు పట్టుకుపోయాను. స(త్రవు కెళ్ళేసరికి మా గుమస్తాగారు నన్నుచూచి యేమిటండో పంతులుగారూ కుక్క-గొలుసు తెచ్చారెందుకు అని నన్నడిగారు. ఇతనికెలా తెలిసింది చెపుమా కొంపతీసి చూడలేదుగద అని అనుకొని (ట్రావెల్ చేసేటప్పుడు (టెయినులో (టంకుకి కట్టుకోవచ్చుకదా అని వేలంలో చీఫ్‌గాకొన్నాను. అని చెప్పి యీ దిక్కు-మాలిన వూరెందు కొచ్చానురా బాబు, మా నాన్నగడించిన డబ్బంతా యిక్క-డయిపోయేలాగుంది. ఇప్పుడే ఇంత ఖర్చుఅయింది లాయర యేసరి కెంతడబ్బవుతుందో ఈ వెధవ ఊరులో అంతాటోపీలేను! యీ వూరుకు మె(డాసనే కన్న టోపీదాసని పేరుపెడితే బాగుండును అని నాలో నేనను

కున్నాను. మా గుమాస్తాగారి ధర్మమాఅని ఆపూటక్కడ భోంచేసి ఈ వెధవ వూళ్ళో అనవసరంగా అట్టేతిరగకూడదు. అని తలంచి నాగదిలోకెళ్లి ముసుకుపెట్టుకుని పడుకున్నాను. మరునాడుదయము లేచి అయ్యో రాత్రి భోజనంమాట మరచి పోయాను. ఒక వెధ్ధశైనా లేపేదు కాదు. అందుకే నీరసంగా వుంది; యీ వెధవ లాయరు చదువు మావూళ్లోవున్నా బాగుం డును అనుకున్నాను. ఇంతలో మా ఫ్రెండు రావయ్యా గిరీశం గారూ టిఫిన్ తిందామన్నాడు. సరే అని నే వెళ్ళి ఆయన తెప్పించిన మినపకుడుములు, పెసరట్లు, పొంగడాలు, గోధుమ నూక ఉప్మపిండి దిట్టంగాతినేశాను. తరువాత ఆయన ఇచ్చిన కాఫీకూడా తాగేశాను. చల్దిఅన్నంతినే ముండావాడ్ని రాత్రి కూడాలేదు. అందుచేత దిట్టంగా ఓపట్టుపట్టేసరికి పాపం మా ఫ్రెండుకి చాలిందికాదు. ఆయనా పాపం మొహమాటపడి చాలునని వూరుకున్నాడు. మేమిద్దరంకూర్చోని ఏదో లోకా భిరామాయణం మాటాడుకుంటూండేసరికి యెవరో మద్దిళ్లూ తాళాలు వాయించుకుంటూ చక్కావచ్చారు. రావే సోమి దేవిఅని పెళ్ళాన్ని పిలుచుకుంటూ ఓబ్రాహ్మడు చక్కా వచ్చాడు. ఆమె అచ్చంగా మా అమ్మలాగ కనబడేసరికి నిజం గాఆమే అనుకోని నాకెంతో దుఃఖంవచ్చి ఎన్నాళ్ళకి కనుపిం చావే అమ్మా అని మీదపడి కౌగలించుకున్నాను. ఇంతలో సత్రవులో నలుగురూ వచ్చి నన్ను బయటికిలాగి విడిపించారు. ఆమె జుట్టూడి క్రిందపడేసరికి సిగ్గుపడి పారిపోయింది. మా

ఫ్రెండు నన్ను ఏమిటయ్యా, యూ ఫూలిష్ నెస్? ఆమె ఆడది కాదు, మొగాడు. వీళ్లు పగటివేషగాండ్రు. నీపాటి ఎరుగవే మిటి అని నాలుగు చీవాట్లు వేశాడు. తరువాత వారంతా ఎవరి దారిని వారు పోయారు. కొంతసేపయాక మేము భోజనానికి వెళ్ళేము. భోజనంచేశాక అంతా ఎవరిగదులలో వాళ్ళం పడుకున్నాము.

మధ్యాహ్నం లేచినదగ్గరనుండి యింతడబ్బు ఖర్చైపో యింది యింకా లాయరు చదవడమైనా ప్రారంభంలేదు. మళ్లీ మా నాన్నని డబ్బుపంపమంటే యేమంటాడో యిలా నేచేసిన దండుగలన్నీ తెలిస్తే బ్రతకనిస్తాడా? ఇంకా మా ఫ్రెండు ధర్మ మాఅని ఇంత అన్నంపడేస్తున్నారు గనుక కనబడడం లేదు. యింక ఇలా వూరుకుంటే లాభంలేదు. మన తెలివితేటలుఉప యోగించి డబ్బు సంపాదించాలి. అని తలంచి మా ఫ్రెండు కైనా చెప్పకుండా బజారుకు బయలుదేరేను. అక్కడో చోట లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ అని వ్రాసివుంది. నేనా లోపలి కెళ్ళి భోగట్టాచేయగా వారేదో కాగితం చేతికిచ్చి అంతా అందులోవుంది అది చదువుకోండి అన్నారు. సరే అని అది తీసుకొని వచ్చి చూచుకునేసరికి అందులో మోటారులవల్ల దెబ్బతింటే మూడువేలు, ఆటలలో కాలువిరిగితే ఒకవెయ్యి, కుస్తీలో కన్నుపోతే అయిదువందలు యిలా యెన్నోరకముల అపాయములకు ఎంతెంతో డబ్బిస్తారని వ్రాసివుంది. ఏదో ఒక దెబ్బతింటేనేం ఎక్కువ డబ్బార్జించవచ్చు. ధనమార్జించ

డానికి యింతకన్న సులువైనమార్గం మరిలేదు. అని నేనాలో చించి ఏదోఒక దెబ్బతిని అయినా యీకంపెనీలో డబ్బులాగె య్యాలి అని నిశ్చయించి కారొస్తుంటే ఏమైతే అయిందని రోడ్డుకడ్డంగా నిలబడ్డాను. కారు దగ్గరగా వచ్చేసరికి ఆడ్రైవరు పీనుగ చటుక్కున పక్కకితప్పించి దున్నపోతులాగ కదల వేమని నా రెక్కపట్టుకొని జోడుకాలితో తుంటిమీద రెండు తన్ని పొమ్మన్నాడు. నే వాడుకొట్టేడని కోపగించుకోకుండా యీ దెబ్బలకి కంపెనీలో యెంతడబ్బు దొరుకుతుందో అనీ సంతోషంగా ఆకాగితం తిరగేశాను. కాని యిలాటి దెబ్బల కేమీ యీయరని అందులో వ్రాసివుంది. నిష్కారణంగా మైము వేస్టయిపోయిందని ఆలోచించి మళ్ళీ బయలుదేరి ఒకచోట ఇద్దరు దెబ్బలాడుతూంటే వాళ్ళ మధ్యనుదూరేను. ఆ వెధవలు నే విడిపించటానికి వచ్చాననుకొని ఎవరిదారిని వారుపోయారు. అన్న, ఈ ఛాన్సుకూడా తప్పిపోయింది. యింకేందారి అను కుంటూ బయలుదేరేను. ఎంతసేపు తిరిగినా ఏమీలాభం లేక పోయింది. అలా తిరిగొస్తూంటే యిదివరకు నేచూచిన సర్కసు దగ్గర జంతువులన్నీ బోనులో పెట్టబడివున్నాయి. నేనవిచూచి అడవిజంతువుల వలన అపాయంకలిగినా డబ్బిస్తారని ఈ పేప రులో వ్రాసివుంది అని తలంచి. అక్కడవున్న పులిబోను దగ్గరకువెళ్ళి గజాల సందులోనుంచి చెయ్యిదూర్చి అట్టే తినె య్యకు చిన్నముక్క కొరుక్కో! నొప్పిపెట్టనియ్యకు; డబ్బొ చ్చాక మేకపోతుని కొనిపెడతానులే అని పులితో చెప్పెను.

ఆ వెధవపీనుగు వ్రాసుకోక చెయ్యి రక్కి, నోటితో కటు క్కనకరచి పట్టుకుంది. నే గోలెత్తి మొర్రో మొర్రో మనేసరికి ఆ సర్కసువాళ్లు నన్ను బలవంతాన బయట కూడలాగి తక్షణం కారుమీద దేసి ఆసుపత్రికి మోసుకుపోయి కట్టుకట్టించి, నన్నక్క డుండమని వాళ్ళు పోయారు. నే నక్కడుండక అంత బాధ లోను కంపెనీకి పోయి డబ్బు తెచ్చుకుందామని బయలు దేరేను. నేనింతా కష్టపడి కంపెనీకి వెళ్లేసరికి ఆ మేనేజరు పీనుగు ఏవో పుస్తకాలన్నీ తిరగేసి మా కంపెనీలో నీవు మెంబరుగా వున్నట్టెక్కడా లేదు. ఇందులో మెంబరు కాని వాళ్ళకి ఏమీ ఇయ్యం, కాబట్టి ఇక్కడ నీకేమీ ముట్టదు, వెళ్లమన్నాడు. ఈసంగతి తెలుసుకోకుండా నే తొందరపడి దెబ్బతినడం నాదేతప్పు అని చింతించి ఆ బాధతో నే బసకు పోయాను. మా ఫ్రెండు నన్నుచూచి ఏమిటండో పంతులు గారూ కట్టుకట్టేరు అని అడిగాడు. ఆ సర్కసు దగ్గరకు వెళ్ళే సరికి అక్కడ పులి ఓ కుర్రాణ్ణి కరవబోతోంది. వానిని తప్పించి బయటకి లాగేసరికి దానికోరలూ గోళ్లు నాకు తగి లాయి. అని గమ్మత్తుగా చెప్పేసేను. ఆ మర్నాడు లేచి మా గుమాస్తాగారి గదికివెళ్ళి అయ్యా మనం ఈవేళ లా కాలేజీకి వెళ్ళాలి అన్నాను. ఆయన ఎందుకేమిటన్నాడు. నేను లాయరు చదవడానికన్నాను. మీరేం చదువుకున్నారని ఆయనఅడిగేడు. సంధ్యావందనం పూర్తిగా చదివేను. నమకచమకాలువచ్చు శ్రీ సూక్తం పురుషసూక్తం కంఠోపాఠమే. సంకల్పం చెప్పడంలో

షష్టు. భాగవతం బారెడుమేర చదివేను. భగవద్గీత పారాయణ మూడుసార్లు పూర్తిఅయింది; తద్దినం. మంత్రం సగంవరకూ వచ్చునని నేను చెప్పేను. ఇవెందుకయ్యా, ఇంగ్లీషెందాక చదివావు? అని ఆయన అడిగేడు. నాకు తెలిసినంత వరకూ చదివాను; కావాలంటే పరీక్ష చేసుకోండి అని నేనన్నాను. అతడెందుకో నవ్వుకొని, అయ్యాయీ చదువులన్నీ 'లా' చదవడానికి చాలవు. బి. యే. అను గవర్నమెంటుపరీక్ష ప్యాసు అవాలి. మీ రింగ్లీషులో ఒక క్లాసైనా ప్యాసవలేదు. కాబట్టి ముందు యీ పరీక్షలన్నీ ప్యాసవుతేగాని వీలులేదు. గనుక యీ పిచ్చివేషాలు మానేసి యింటికి వెళితే బాగుంటుంది. లేదా మీకింకా ఈడు మించలేదు. గనుక పట్టుదలగా కృషి చేసి, చదివి, యీ పరీక్షలన్నీ ప్యాసవండి. తరువాత లా చదవవచ్చునని ఆయన చెప్పేడు. నాకామాటలు వింటే అతి కోపంవచ్చి మెతుకులు పద్దురాసుకోవడం. తప్ప వీడికేం తెలియదు – వీడిమొఖం వీడిసాయం నాకెందుకు తాపీగా నేనే వెళ్ళవచ్చునని నిశ్చయించి బయలుదేరి లా కాలేజీ చేరుకున్నాను.



# లాయరు గిరీశం

## మూడవ భాగం



నేను లాయరవడానికి బయలుదేరి మెడ్రాసు చేరుకొని ఎన్నెన్ని జోల్తాలైనా కొట్టి చిట్టచివరకు మా సత్రవు గుమాస్తా వద్దన్నా వినక అలా చదవాలన్న ఆశతో లాకాలేజీ చేరుకున్నాను. అక్కడ కాలేజీ యజమానులు నే జాయిన్ అవడానికి వీలులేదు పొమ్మన్నారు. అన్నా! చంపేసురా, బాబూ! మీలాంటివాళ్లు అంతా యజమానులవబట్టే చదువులిలా ఏడుస్తున్నాయి. నా అంత సివిలైజుడు వానినే జాయిన్ అవనీయకపోతే యింకెవ్వడు పనికివస్తాడు; అయినా మనము యింటిదగ్గర బయలుదేరినవేళ మంచిదిగాదు. ఏమయితే అయింది, వెళ్ళి మా ఫ్రెండుతో ఆలోచిద్దామని సత్రవుకు బయలుదేరేను. దారిలో ఏదో ప్రొసిషన్ ఎదురైంది. ఏమిటా అది అని నేనాశ్చర్యంగా చూచాను. ఏదో మేళాలు; తాళాలు లైట్లతో ఓ పూలపల్లకి వస్తూవున్నది. ఓహో మేరేజి వూరేగింపా; భోగంమేళం లేదేమిచెప్మా అనుకున్నాను. ఇంతలో ఆ పూలపల్లకి దగ్గిరైంది. పెళ్ళికూతురు లేదేమిచెప్మా అని నిదానంగా చూచాను. ఇంతలో పెళ్ళికొడుకు చాల ముసలాడిలాగ కనిపించాడు. అందుకే పెళ్ళికూతురు సిగ్గుపడి రాలేదనుకున్నాను. ఇంతలో వెనకాతల

గొల్లున ఏడుస్తూ వస్తూయున్నారు. అన్న ! శవమురా బాబూ ఎందు కెదురయ్యానురా దేవుడా ! ఈ దిక్కుమాలిన వెధవలికి యీ మేళాలు తాళాలెందుకు? ఈ ముసలిపీనుగు నా కలలోనే వుంటాడేమో, ఈ జడుపుతో నడిచి నెళ్ళడం కష్టం. బండేనా ఎక్కిపోవాలి అనుకుంటూ బయలుదేరేను. కాని భయంచేత గుండె గతుక్కుమని కడుపు గలగలమంది, అన్న! ఏందారిరా బాబు అనుకొని బట్టపాడవకుండ ఓ ప్రక్కన కూర్చున్నాను.

ఇంతలో ఎవడో గుర్రంమీద ఎక్కివచ్చి ఏయ్ ఫూల్, ఏమిటీ న్యూసెన్సు అని కొరడాతో కొట్టబోయాడు. కొట్టకు కొంచెము నీళ్ళున్నాయా అని డేరింగుగా అడిగేశాను; ఆ మాలవెధవ వూరుకోక నా జుట్టుపట్టుకొని యీడవబోయాడు. ఈ వెధవలు యిలా విడవరు వెండిచెప్పుతో కొట్టాలని మొల నుంచో రూపాయితీసి వాడిఎదాన్ని కొట్టేను. అది పుచ్చుకొని నన్నొక కిక్కుకొట్టి పొమ్మన్నాడు. ఎలా అయితేనేమి ఎన్నో తంటాలుపడి నే బసచేసిన సత్రవుకు చేరుకున్నాను.

మా గుమాస్తాగా రేదో అడగబోతే మాటాడకండి మయలుబడ్డానని నూతికి బోయి బట్టలుతుక్కొని స్నానంచేసి చక్కావచ్చాను. మా ఫ్రెండు దయవలన ఆపూటకక్కడ భోజనంచేసి చాలడబ్బు ఖర్చు అయిపోయింది, చదువు జరగ లేదంటే మా నాన్న చంపేస్తాడు అని తలంచి మా ఫాదరు కిలా ఉత్తరము వ్రాసేను :

శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ నాన్నగారికి, కుమారుడు వేదోక్త నమస్కారములు చేసి వ్రాయునదేమనగా : యిక్కడ నా లాయరు చదువు పూర్తిఅయింది. ఒక్క ప్యాసవడం సబ్‌జెక్టుమాత్రం వుండిపోయింది; అయినా అదిఅంత లెక్కలోనిది కాదు. గనుక నాలుగైదురోజులలో వచ్చేస్తున్నాను. మీరు లోగడ వ్రాయించిన వుత్తరములో మా మామ కూతురు సోమిదేవిని నాకు మేరేజిచేస్తామని వ్రాసినారు. నా కాలాటి అన్‌సివిలైజుడు పల్లెటూరిపిల్లని పెళ్ళిచేసికోవడము ఇష్టము లేదు. నేను పెళ్ళిచేసుకునే పిల్లకి ఎట్‌లీస్టు 18 ఏండ్లువుండాలి; బ్యూటీగావుండాలి; హిందీయింగ్లీషువచ్చివుండాలి; అధమము 60 జావళీలేనా పాడగలిగే సంగీతముండాలి. పిల్ల నాభుజాల దగ్గరకువచ్చేటంత ఎత్తుగావుండాలి. మా కాలేజీకి శలవులు యిచ్చేస్తున్నారు. గనుక నేనునాలుగైదు రోజులలో బయలుదేరి వస్తూయున్నాను. ఇంతేసంగతులు. ఇక్కడంతా క్షేమం అక్కడక్షేమం వ్రాయించవలెను." అని వ్రాసి పోష్టులో పడేశాను.

మరిరెండు రోజులయాక మా ఫ్రెండుదగ్గర శలవుపుచ్చుకొని మావూరు వెళ్ళడానికి బయలుదేరేను. నే వచ్చేటప్పుడు ఏ సామాను తేకపోయినా ఇక్కడ కొన్నదో కేంపుకాటు, ట్రంకుపెట్టె, సూటుకేసు, పట్టుకొని బయలుదేరేను. ప్రయాణంలో అనుభవము గలవాడినిగనుక హాయిగా మెయిలుఎక్కి బయలుదేరేను. ఆమదాలవలస స్టేషనులో నే దిగేసరికి మా

ఫ్రెండ్సు కొందరు, మానాన్న స్టేషన్‌లో కలుసుకున్నారు. మానాన్న నన్నుచూచి కొడుకుని యింతవాడిని అయానుకదా అని డంగు అయిపోతాడు అనుకున్నాను. ఆ ముసలాడు వూరుకోక "ఓరి మాదిగాడికొడుకా? ఈ వెధవ మాల రూపే మిటిరా ఈ వేషమేమిటి ? ఈ బోడిబుర్రఏమిటి? అని తొమ్మిదవ అష్టకము ప్రారంభించాడు. ఊరుకోవయ్యా నీకేమిటి తెల్సు లాయరవడమంటే ఏమిటనుకున్నావు అనికొంచెము కోపంగా చెప్పేసరికి వూరుకున్నాడు.

ఇంతలో మా ఫ్రెండ్సుఅంతా ఏమిరో గిరిగా చాలా రోజులుకి అని పలుకరించారు. మేనర్‌లెస్ ఫెలోసుకీ, యింత మర్యాద తెలియదు. ఎలాబ్రతుకుతారో అనుకున్నాను. నే నింటికి మోటారుమీద పోదామని ఎంతప్రయత్నించినా మా ముసలాడు ఒప్పుకోలేదు. విధిలేక వారితోబండిమీదనే బయలు దేరేను. మెల్లిగా కొంతసేపటికి మావూరు చేరుకున్నాను. మా అమ్మావాళ్ళు నన్ను కలుసుకొని ఎంతో ఆనందించారు. నాకా వెధవమెద్రాసు వదిలిపోవడం శని వదలినట్లుగవుంది. ఏమంటే స్టూలుకు వెళ్ళడానికి విశాలంగా యింతచోటేనా దొరికేదికాదు.

ఇంతలో మావూరు సమీపంలో ఓ చిన్న యాత్ర వచ్చింది. అక్కడ దేవుడికళ్యాణానికి ప్రతియేడు మా వూరు వాళ్ళు అంతా వెళ్ళడం మామూలు. మా ఫ్రెండ్సు అంతా నన్నురమ్మని పీక్కుతిన్నారు. కాని అలాటి అన్‌సివిలైజుడు

బ్రూట్సుతో నాలాటి సివిలైజుడుబ్రూటు వెళితే ఏమయినా దర్జా తక్కువగా వుంటుందేమో అని వాళ్ళని ముందుపొమ్మని నే షోకుగా ముస్తాబై సైకిల్ మీద వెళ్ళుదామనుకున్నాను. మంగలాడిని పిలిచి క్షౌరము చేయమనేసరికి ఆ వెధవగెడ్డం గీయడము మాని బుర్రగీయడం మొదలుపెట్టేడు! వాడినొక తాపుతన్ని బుర్రఎందుకు గీశావురా వెధవ అని అడిగేను. నాన్నగారు వారిలాగ సేసీమన్నారు. అని వాడు గోలెత్తాడు. ఇంతలో మానాన్న రావడంచేత షోకు చెడిపోయినదిరా దేవుడా అని ఏడుస్తు విధిలేక కూర్చుని క్షౌరం చేయించు కున్నాను. వాడు మామూలుప్రకారం పెద్ద పిలకుంచి గోర్జి చెక్కేసి పోయాడు. నేను స్నానంచేసి భోంచేసి, రాత్రి యాత్ర చూడడానికి వెళ్ళాలని మధ్యాహ్నమునుంచి ప్రయాణం సరం ఝూములో వున్నాను.

సాయంత్రం అయాక యిస్త్రీమడతలుఅన్ని తొడిగి మానాన్న చూడకుండా ఎరువుసైకిల్ మీద బయలుదేరేను. కొంత సేపయేసరికి దేముడి కల్యాణమయేచోట సమీపిం చాను. అక్కడ భోగంవాళ్లు ఆడుతున్నారు. నే సైకిల్ను త్రొక్కేసరికి సైకిలుతో నా ప్రక్కనున్న మురికికాలువలో తిరుగబడ్డాను. బట్టలన్నీ బురదయిపోయాయి. నలుగురూవచ్చి లేవనెత్తేరు. అక్కడ మా వూరువాళ్లు కనబడితే వాళ్ళ పైమీదకండువా పుచ్చుకొని ఒకటి కట్టుకొని ఒకటి కప్పు కున్నాను. ఆవూరు పెద్దలంతా సన్ను మర్యాదచేసి తీసుకు

వెళ్లి సభలో కూర్చోబెట్టారు, వారందరికి ముస్తాబు కూడా నాలాగేవుంది పర్వాలేదనుకున్నాను.

ఇంతలో ఆ భోగంది ఆడుకుంటూ వచ్చి పాపం పడ్డారా పంతులుగారు దండం అంది నాకు మహా కోపంవచ్చి పడితేపడ్డాను నాయిష్టంనాది నీకెందుకు పొమ్మన్నాను. కొంత సేపయాక అక్కడ మనవాళ్ళంతా దక్షిణ తాంబూలాలు సమర్పించడం మొదలుపెట్టేరు. అంతా తాంబూలాలు ఈయ డమే గాని ఒక వెధవయినా దండం పెట్టేడుకాడేమిచెప్మా అను కున్నాను. ఇంతలో ఆ భోగంది నాదగ్గరికి వచ్చేసరికి నేనో డబ్బు, తాంబూలముయిచ్చి దండంపెట్టేను. అది పుచ్చుకొని ఆ వెధవ ఎందుకో నవ్వుకుంటూ పోతూంది. నే గబుక్కున లేచి దానిచెయ్యి పట్టుకొని ఏడిసినట్టేవుంది నీ తెలివి. దీవించ కుండా పోతున్నావేమి అని మా ఫోర్సుగా దెబ్బలాడి నాడబ్బు నే లాక్కొని చక్కాపోయాను.

కొన్నాళ్లకి నే వద్దన్నా వినకుండా మానాన్న, అమ్మ బలవంతముచేసి మామకూతురు సోమిదేవినే నాకు పెండ్లి చేసారు. మరికొన్నాళ్లకి పెద్దలైన మా తండ్రిగారు గతించారు. నాకింకా లాయరవాలన్న ఆశ వదలలేదు. అందుచేత మా వ్యవహారములన్నీ మా మామకు వప్పగించి నేతిరిగి మెద్రాసు వెళ్ళేను. అక్కడ మా ఫ్రెండు అయిన సత్రవుగుమాస్తాగారిని కలుసుకొని ఇంటిదగ్గర బాగా స్టడీచేసి వెళ్ళేనుగనుక ఆయన సహాయంచేత యూకంగా స్కూలుఫైనల్‌లో ప్రవేశించానని

నాలుగు దేశాలు తిరుగుతూ నాలుగు సంగతులు చూస్తూవుండ బట్టి లోకజ్ఞానం బాగాకుదిరింది. పూర్వపు నా చర్యలు తలుచుకుంటే నాకే నవ్వువస్తూవుండేది. ఎలాగయితేనేమి పట్టుదలగా చదివి ఏటేట ప్యాసై బి. ఏ; బి. యల్. కూడా ప్యాసయ్యాను.

ఎలాగైతేనేమి, నాకోరిక తీరిందా అని చాలాసంతోషంగావుండీది. నా సివిలైజేషన్, నా లోకజ్ఞానము నా తెలివితేటలు చూచి మా ఫ్రెండు ఎలాగ మారిపోయానా అని చాలా ఆశ్చర్యపడుతూ వుండేవాడు.

నేనింక మావూరువెళ్లి కొంతకాలము ప్రతిపల్లెటూరు తిరిగి లోకానుభవము లేని అనాగరికులగు కొందఱు మన హైందవ సోదరులకు ప్రపంచకజ్ఞానోపదేశముచేసి వృద్ధిలోనికి తేవలెనని నిశ్చయించి మామిత్రునివద్ద శలవుపుచ్చుకొని మా వూరు బయలుదేరేను. నాభార్య రజస్వలయి చాలాకాలమయియుంటచే సఫ్‌షల్ స్ చేసుకొనమని మామామనిర్బంధించాడు. అప్పటికి మా సోమిదేవివేషం ఏలాగవుందంటే వఠ్ఠిదానిలాగ ఒంటినిండపసుపు, రూపాయియంత కుంకుంబొట్టు, ముక్కుకి ఒక ముత్తెంలేనికమ్మి, ఒక గావంచాపంచ కట్టుకొని మూతి వాయినం ముత్తయిదువులావుంది. ఇలాటిది నాకుభార్య అయినందుకు చాలావిచారించి పూర్వము నేనింతకన్న అధ్వాన్నంగా వుండే వాణ్ణి. ఈమెను ముందు మంచిదారిలో పెట్టాలనుకున్నాను. కొన్నాళ్ళయాక నేను నా భార్యతో కలసి మా వూరు సమీపములోవున్న శ్రీకాకులంలో కాపరం పెట్టేను.

అక్కడే కోర్టులో ప్రాక్టీసు మొదలుపెట్టేను. నా నాగరికతకీ మా ఆవిడ అనాగరకతకీ — నా అనాచారానికి — మా ఆవిడ ఆచారానికీ యేమీ సరిపోక యింట్లో రోజూ పేచీ పడుతూ వుండేవారము; అయినా నా వైఫ్ చాలా పతిభక్తి గలది గనుక మారుమాటాడకుండా వూరుకునేది. ఒకనాడు పార్టీలంతా వచ్చి పంతులుగారూ కొంచెము దాహానికిప్పించ మన్నారు. వుట్టినీళ్ళిస్తే యేమిబాగుంటుందని మా ఆవిడని పిలిచి కొంచెం సుద్దినీళ్ళియ్యవే అన్నాను. సరేనని ఆమె ఇత్తడి చెంబుతో తెచ్చి యిచ్చింది. నేనదిచూచి యేమిటే ఫూల్ యిత్తడిచెంబుతో తెచ్చావు? కిలం ఎక్కడా అన్నాను. ఆమె నను చూచి బాగా నేవుంది మీ తెలివి! పేడనీళ్లు కిలుము యెక్కుతాయా అంది. ఓసిముండా పేడనీళ్లెందుకే అని అడిగాను. సుద్దినీళ్ళంటే మరేమేటండి అంది. ఆ మాటవింటే నా కోపం అంతా పోయి నవ్వువచ్చింది. అప్పుడు మజ్జిగనీళ్ళని చెప్పి తెమ్మన్నాను. ఆమె తీసుకువచ్చింది. మా పార్టీలకు దాహమిచ్చి పొమ్మన్నాను. మా ఆవిడికి కాఫీచెయ్యడం రాదని నేను రోజు క్లబ్బుకు వెళ్ళే కాఫీ త్రాగుతూవుండేవాడిని. ఆ వేళ బంట్రోతునిపంపి కాఫీ తెప్పించుకుని త్రాగుతున్నాను. ఇంతలో నాభార్యచూచి "ఏమిటండీ యీ అనాచారము కాపాడు తెచ్చిన గంజి త్రాగుతున్నారు! కావాలంటే వంటవగానే యింట్లోనే త్రాగ కూడదా? నిష్కారణంగా రోజూ పారపోస్తున్నాను గదా" అంది.

ఓసిముండా! యిదిగంజికాదె! దీనిని కాఫీఅంటారు. చాల బాగుంటుంది. దీనిని మనవాళ్ళు యెంతో కష్టపడి విదేశీయుల వద్దనుండి సంపాదించారు. ఫూల్‌గనుక నీ వెరుగవు. ఇది యింటింట యిలవేల్పులావుంది. అని చెప్పేను.

ఒకనాడు నాకు తలంటి నీళ్లు పోసుకోవాలని బుద్ధిపుట్టి మా ఆవిడని నీళ్లు కాచమన్నాను. ఆమె సరే అంది.

నేను ఆఫీసుపని చూచుకొని తలంటించుకొని మా ఆవిడని తలరుద్దమన్నాను. ఆమె తలరుద్ది నీళ్ళుపోసింది. ఏమే నీళ్ళు కాచలేదా చన్నీళ్లుపోశావు అన్నాను.

"అయ్యో కాచకేమి? కాగిచల్లారేయి"అంది. "ఏడిసి నట్లేవుంది నీ తెలివి; చాల్లారిపోతే ఎలాగ ? అని నేకోపగించాను. కాగి చల్లారిననీళ్లు పథ్యానికే పనికివస్తాయికదా ? పైకి పోసుకోడానికి పనికిరావా అని ఆమెఅంది. ఓసి వెధవ! పిడుగుకి బియ్యానికి ఒకటేమంత్రమా, అని కేకవేసి ఆమె తెలివి తక్కువకు నేను నవ్వుకుంటున్నాను. ఆమెవూరుకోక "ఏమండీ కంటిచేయించరా ? మీరు సంతోషంగా వున్నప్పుడు అడగమన్నారుకదా" అని అడిగింది. "ఏడిశావుముండా! వూరుకోమని కోపమాపుకోలేక దానినో రెండుతన్ని నాలుగు చాదలు నీళ్ళుతీసి పోసుకొనిపోయాను.

ఒకనాడు భోజనముచేస్తూవుంటే మాఆవిడ వడ్డిస్తూంది. యెలా అయితేనేమి మునుపటికన్న కొంచెము దారిలో పడుతూందని నేనామెనుచూచి సంతోషిస్తూ పప్పుకూర, వచ్చడి,

పులుసు కలుపుకునితిని— మామూలుగా మా ఆవిడిని పెరుగు వెయ్యమన్నాను, సరేఅని ఆమె యింతకూర తెచ్చి వేసింది. ఇదేమిటీ అని నేను కోపగించి అడిగాను. కోపం ఎందుకు? యివాళ పెరుగు కూరలో నేకలసిన్వుంది. ఇది పెరుగు తోట కూరట అంది. ఓసి ముండా! పెరుగుతోటకూరంటే అందులో పెరుగుందనుకున్నావా? ఏడిసినట్టెవుంది, నీ తెలివి. పెరుగు పట్టుకురా అన్నాను. వేరే దండుగెందుకని కొనలేదండి అంది. చంపేవే ముండా! అని దానినో దాలుగుతిట్టి అర్ధాకలిగా లేచిపోయాను. మా ఆవిడ నాదగ్గర డబ్బుచూస్తే యిచ్చేయ మంటుందని, పెట్టెలో డబ్బంతా మనదికాదు సుమీ పార్టీల దని చెప్పుతూండేవాడిని.

ఒకనాడెందుకో అర్జంటుగా యింటికివచ్చి పెట్టెతెరచి చూసేసరికి పట్టెలోవున్న వెయ్యిరూపాయలు కనబడలేదు. గుండెగభేలుమంది. ఈ ముండ తీసి దాసిందిరా బాబు అను కొని మా ఆవిడిని పిలిచి "ఏమే ఇందులో రూపాయలు అన్నీ ఎందుకుతీశావు" అని కోపంగా అడిగేను. 'బాగానేవుంది మీ కోపం, మీకూను ఎంతసేపుచూచినా మీరురాలేదు. మీరుచెప్పిన పార్టీలువచ్చి అర్జెంటుగా లెక్కకావాలని గోల త్తేరు. తాళాలులేవని చెప్పినావినలేదు. తాళం బద్దలుకొట్టి లెక్కయిచ్చి అమ్మా ఆతాళండబ్బు యిచ్చుకుంటామన్నారు. మీరు చెప్పనే చెప్పారుకదా అని అలాచేశాను. ఇదిగో తాళానికి రూపాయికూడా యిచ్చారు. అని ఆరూపాయి

అక్కడ పారేసింది. ''ఓసిముండా, కొంపముంచావులే'' అని గోలెత్తిపోయాను.

మరికొంతకాలమయాక ఒకనాడురాత్రి వెన్నెట్లో మా యింటిడాబాపైని నేను మాఆవిడ చెరో ఛైరువేసుకొని బాతాఖానీచేస్తున్నాము. ఆ మాటల సందర్భములో నేను మా ఆవిడని "నీకు యింగ్లీషు చెప్పించాలనివుంది చదువుతావా" అని అడిగేను. ఎందుకేమిటని ఆమె అడిగింది. హాయిగా నువ్వావుద్యోగం చేయవచ్చునని నేను చెప్పేను. ఆమె మండిపడి ఆడవాళ్లు ఉద్యోగాలుచేయాలా? మావంతు పిల్లలుని మీరు కనండి అని ఏమేమో దడదడవాగేసింది. మీరు యింతడబ్బు తగలేసి లాయరు చదివేరుకదాఅందుకువచ్చే లోమూడోవంతేనా గిడుతుందా అంది. మా పిన్నికొడుకు బి. ఏ. ప్యాసయి బిచ్చమెత్తుకుంటున్నాడు. చూడలేదా అంది. మొగాళ్ళే మొర్రో మంటూవుంటే ఆడవాళ్లకి కూడా ఎందుకా చదువు? ఈపాటి కూరుకొండి అంది. ఈ మాటవింటే మా ఆవిడ ఫూల్ కాదు; ఫుల్ గా తెలివయిందే అనుకున్నాను. మా ఆవిడ చెప్పినట్లు లాయర్ లో లాభం లేనేలేదు. ప్రజలలో పేరయినా తెచ్చుకోవాలని, ఆవూరులో యేసభలు జరుగుతూయున్నా, "అందరం అయికమత్యముగా వుండాలని, జాతిభేదాలుంచుకో కూడదని ప్రతి విషయములోనూ ఒకరియెడల ఒకరు సానుభూతి చూపించాలనీ" ప్రతిచోటా జోరుగా ఉపన్యాసాలు యిస్తూ వుండేవాడిని.

ఇంతలో మా పొరుగునున్న తురకలయింట్లో మా రేజ వచ్చింది. వారు నన్నూ మా ఆవిడనీ విందుకు పిలిచారు. ఆ మాట వినేసరికి నాగుండె గుభీలుమంది. దానికి తగినట్టే మా ఆవిడ గుప్పెడు జంజాలతోవున్న బ్రాహ్మణులను భోజనానికి పిలవడమా ? పిలిచీవాళ్ళకీ సిగ్గులేదు, పిలిపించుకునే వాళ్ళకీ సిగ్గులేదు. నా కంఠంలో జీవంఉండగా యిలాటి ఘోరాలు జరుగనిస్తానా అని గోలెత్తింది. అబ్బే అందరిలో గొప్పకలా వాళ్ళు పిలిచారుగాని నిజంకాదు. భోజనానికి రమ్మంటే వూరుకుంటానా డొక్క చీరెయ్యనా? నాకు మాత్రం కులం బెలం అక్కర లేదనుకున్నావా ? శోత్రియమైన కొంపలోబుట్టి యిల్లా చేస్తానా అని నాలుగు మాటలు చెప్పి నమ్మించాను. కాని యింతలో ఆ ఫ్రెండ్సు పిలవడానికి వచ్చేసరికి "నేనెటో అర్జంటుగా పనిమీద వూరికి వెళ్ళాలని చెప్పివెయ్యి" అని నేను లోపల దాంగొని మా ఆవిడను పంపించాను.

మా ఆవిడ వెళ్ళి వాళ్ళతో "ఆయన యెటో వూరికి వెళ్లేనని చెప్పమన్నారు" అని చెప్పింది. ఎప్పుడు చెప్పేరు? అనివాళ్ళు అడిగేరు. ఇప్పుడే చెప్పేరు. అబద్ధమాడుతానా- కావాలంటే పిలుస్తాను అడగండి అని లోపలికి వచ్చేస్తూంది. అన్నా కొంపముంచావే ముండా అని పెరటిదారిని పరిగెత్తేను. పారిపోతే వూరుకుంటానా, యేమయినా సరే యివాళ వాళ్ళ యింట్లో తిననీయను అని వెంబడించింది.

ఇలా మేము వీధి పడేసరికి వూర్లో జనంఅంతా కంగారై మాకడ్డంగా పరుగెత్తుకువచ్చి ఇద్దరిని చెరో నలుగురు పట్టు

కొని ఏమిటిసంగతని అడిగేరు. ఏమీలేదు - ఎవడో చెంబెత్తుకు పోతున్నాడు, పట్టుకోవాలని పరుగెత్తేను అని నేను చెప్పేను.

లేదండి బాబు, తురకల్లో కలసిపోవడానికి వెళ్ళుతున్నారు. ఆపుచేయండి, బాబు, ఆపుచేయండి అని అది గోలెత్తింది. ఇంక ఎందుకు అల్లరి అని మా ఆవిడిని మెల్లగా యింటికి లాక్కొచ్చేశాను.

ఇలా కొంతకాలం అయాక నేనొకనాడు బజారునుంచి వస్తూవుంటే ఒక షాపులో పచ్చని చిమ్నీతోవున్న ఫస్టుక్లాసు అయిన బెడ్‌రూమ్‌లైటు కనబడింది. దానికొక నగిషీ నగిషీలు గల గాజు షేడ్ కూడా వుంది. నాకదిచూస్తే ఎంతో సరదా పుట్టి తీసుకువెళ్ళి మా బెడ్‌రూమ్‌లో వెలుగించుకుంటే చల్లగా వుంటుందని ఆలోచించి ఎంతో సరదాపడి వాడన్న రెండు రూపాయలుయిచ్చి కొని యింటికి తెచ్చాను. మా ఆవిడ అదిచూచి ఏమిటిఅని అడిగింది. బెడ్‌రూమ్‌లైటు అని చెప్పి దానికియిచ్చి వెళ్లి గదిలో గోడకు కొట్టుమని చెప్పేను. వెళ్లడం ఎందుకు అని గుభీమని ఆలైటు గోడకి విసరికొట్టింది. ఓసి వెధవా, యిదియేమిటే యీపనీ? అని నాలుగు తిట్టేను. ఆ ముండ వూరుకోక మీరుచెప్పి మళ్లీ తిడతారెందుకూ అంది. ఏడిశావ్ వూరుకో అని ఆ గాజుపెంకులన్నీ తీసి ఎత్తి అవతల పారేసుకున్నాను.

ఇలా కొంతకాలం జరిగింది. నా లాయరు చదువు వల్లనూ, గడింపు లేకపోవుటవల్లను, మా ఆవిడ తెలివితక్కువ

చేత కలిగించే దండుగువల్లనూ చాలా ఋణాలయిపోయాయి. అందుచేత వున్న భూమీ, ఖ్యాట అమ్మేశాను. అప్పుడే యీ కబురు యెలా తెలిసిందో వూరంతా పాకిపోయింది.

లాయరు డాబుసరికోసం చేసిన అప్పులు మాత్రం యింకా వూరులో వుండిపోయినాయి. ఏందారిరా అని బెంగ కలిగింది. నా బెంగకి తగినట్లే "ఏమయ్యా బట్టలుబాకీ బ్యాలెన్సు అయిదు రూపాయలే యిచ్చినారుకారు" అని ఒకరు. "టిఫిన్ బాకీ వందరూపాయలే యిచ్చారేమి తక్కిన మూడు రూపా యిలూ యెవరిస్తా రనుకున్నావయ్యా" అని ఒకరూ "టవున్ హాలు చందా అయిదురూపాయిలు. కావాలంటే యిచ్చేసి మానీయండి అని ఒకరూ, "ఇల్లు మాకు చాలుటలేదు యీ నెల అద్దెయిచ్చేసి కాళీ చేయించమని" ఒకరూ పెరుగు, పాలు బాకీ మీరు యిచ్చిన అడ్వాన్సు వందరూపాయిలు పోగా రెండు రూపాయలు యివ్వాలండి యిప్పు డియ్యక తప్పదని ఒకరు, నాకు నీవుబహుమతి యిచ్చిన వుంగరంకి మజూరీ యీయవలసిన మూడురూపాయలు రావాలి. వుంటే యిచ్చివేయమని ఒకరూ యిలా యిల్లుచుట్టేశారు. అయినా నాకు విచారం కలుగలేదు. ఎందుచేతనంటే పొరుగూరువారెవ రయినా యీ జనాన్ని చూస్తే పార్టీలు అనుకుంటారు. పెద్ద ప్లీడరునని కేసు లేనా యిస్తారు అనుకున్నాను.

ఇంతలో దైవకృపచేత యెవరోమోటారుదిగి లోపలికి వచ్చారు. నేమర్యాదచేసి కూర్చోమన్నాను. ఆయన ఒక

యెస్టేటుయొక్క దివానునని న్నీ నన్ను వారిదావాలన్నీ చూచుటకు లాయరుగా నియమించాలనిన్నీ నెలకు మూడు వందల జీతమనిన్నీ వెయ్యిరూపాయలు అడ్వాన్సు పుచ్చుకోమనీ చెప్పి యిచ్చి నాకు అర్డరుయిచ్చి నా వల్ల రశీదు పుచ్చుకొని తరువాత వారి బసకురమ్మనిచెప్పి వెళ్ళేరు. ఆ దివానుగారు నా పాలిటి భగవంతుడులా వచ్చాడని నే సంతోషించి గిరీశంగారు అమాయకులు గనుక యిలాజరిగిన దనుకున్నాను.

మా ఋణదాతలందరినీ ఒక్కొక్కరిని పిలిచి డబ్బిచ్చేయ్యాలనిపిలిచాను. "ఇందాక ఏదో అవసరంవచ్చి అడిగాం తొందరేమిటి బాబూ?'' అని ఒకరూ ''తమవద్ద సొమ్ము యెక్కడికి పోతుంది. బ్యాంకులో దాచుకున్న ట్లేను" అని ఒకరు ''మీరు కేవలం దేవుడులాటివారు మీరు మాయింట్లో వుండడమేచాలు- యిల్లుసదుపాయంగావుందా, పెంకు తిరుగ నేయించనా" అని ఒకరు, ''బాబయ్యగారు మహాదొడ్డవారు గేదెలను కొనిబెట్టి అప్పు పాలు పెరుగు మీద తీర్చుకున్నారు.'' అని ఒకరూ, ''ఉంగరం యియ్యడమేకాకుండా మజూరికూడా మీరే యివ్వాలా వూరుకుందురూ'' అని ఒకరూ, టవునుహాలుకి మిమ్మలినే ప్రెసిడెంటుగా యెంచుకున్నాము. అనిఒకరూ అంతా యిలాగ చెప్పడం ప్రారంభించారు.

అన్న, వెధవల్లారా, యెంతలోమారిపోయారురా అనుకొని యిక వీరిననడం ఎందుకు ? మనం బుద్ధితెచ్చుకోవాలనుకొని వారందరికీ బాకీలు సీదాగా యిచ్చేశాను. చదువను

లారా! లోకంలోసంగతి యెల్లావుందో గ్రహించారా! శాస్త్రకారుడు "ధనంమూలం ఇదంజగత్" అని వూరికే చెప్పలేదు. డబ్బుతో వుంది డాబుసరి అంతా. యీ ప్రస్తుత ప్రపంచములో గల స్నేహితులు, బంధువులు, అక్క-చెల్లెండ్రు, అన్నదమ్ములు, ఆలిబిడ్డలు-ఇంతెందుకు సర్వజనులు ధనసంబంధ మైనవారే. మంచో చెడ్డో చేసి మనీ గడించినవాడే మొగాడంటున్నారు. దశమంతుడంటున్నారు. గాన నాయనలారా! కొంచెం మెలుకువగా నడచుకోండి. నేను మీకు చెప్పునంతటి వాడనుగాను-కాని నా స్వానుభవమువల్ల, బుద్ధివచ్చినది. అందుకే యీ సంగతి లోకుల కెరింగించుకున్నాను. గాన చదువరులారా! సాధ్యమైనంతవరకు-దేశాటన చేయండి; వీలైనంత విద్య నేర్చుకొనండి- లోకానుభవముకలిగి యుండండి - మహాత్ముల సేవ జేయండి - మంచిదారి నవలంబించండి. ప్రాజాభిమానము జూపండి-కనికరహృదయము కలిగియుండండి-మా కాయుష్య-మా కారోగ్యము అని వూరుకోనకండి - బీదజనులకు తోడ్పడండి - దుర్మార్గుల సన్మార్గులుగ మార్చ ప్రయత్నించండి-కలిమిలేములు కావడికుండలవంటివని గ్రహించండి. జీవము లశాశ్వతములని తెలుసుకొనండి - కీర్తి అపకీర్తులే నిలుచునని యెరుగండి - నిశ్చల చిత్తముగలిగి యుండండి - కుటిలాత్ముల గూడి చెడిపోకండి - ఈమాయ ప్రపంచమున న్యాయాన్యాయ పరిశీలన అరుదయ్యెను. ఆహా! కాలమెంత విపరీతముగా మారుచున్నదో చూడండి - వినాశకాలే విపరీతబుద్ధి యన్నటులు

ప్రజలలోకూడ ఎట్టిమార్పులు కలుగుచున్నవి! జనులలో పాపభీతి లేనివారు అన్యాయపరులు, అసత్యవాదులు, జారులు, చోరులు, కపటులు, మోసగాండ్రు ఎక్కువగుచుండిరని తెలుసుకొనండి. పూర్వులవలె పురుషులలో చాలవరకు బుధజనవిధేయులగుచుండుట లేదు. స్త్రీజన విధేయులగుచుండిరని గ్రహించండి, ఇక స్త్రీలసంగతి చెప్పుటకు నాకేసిగ్గగుచున్నది. మతాచారములు మంటగలుపుచుండిరి. కులాచారములు కుంకిటిద్రేళ్ళతో లాగివేయుచుండిరి. నాయనలారా! ఏమయిననూ లోకుల నిందించుట నాకెందుకు? నాగతి నేచూచుకొనగలిగిన చాలును. ఎవరిపాపమును వారే అనుభవించెదరు. దేశమున జనులు బోధకులులేక పాడగుచుండుట లేదు. పాపపుణ్యములు ఎరుగకపోలేదు. గాన నాకు శలవిండు, యింతటితో విరమించెదను.

స మా ప్తః



శ్రీ సత్యవతీ ప్రెస్, రాజమండ్రి.